# మెహెర్ కథా మంజరి

(మెహెర్ అవతార ప్రాశస్త్యం)



రెండవ భాగం

సంకలనం

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వర రావు

అవతార్ మెహెర్ బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

MEHER KATHA MANJARI

by G. V. G. K. Chandramouleswara Rao

First Edition : 31St Jan. 1982

Copies : 1000

**Price : Rs. 3-00**

Title Design :
Dr. G. V. PURNACHAND

Printed at :

Decent Ganga Press, Vijayawada-2

For Copies :

G. V. G. K. Chandramouleswara Rao
29-26-12 Museum Road, Vijayawada 520 002.

Published by :

AVATAR MEHER BABA MACHILIPATNAM CENTRE
MACHILIPATNAM-521 001.

# తొలి పలుకులు

జై బాబా!

బాబా ఆజ్ఞగా "మెహర్ కథామంజరి" రెండవ భాగమునకు కూడ ఉపోద్ఘాతము వ్రాసే అవకాశము నాకు లభించినది. ప్రథమభాగము దైవ ప్రేమికుల ఆదరణ పొంది మహర్షి శుద్ధానంద భారతి, సద్గురు మెహెర్ చైతన్య మహరాజ్ ప్రభృతుల ప్రశంశలతో అనతికాలలో నే రెండవభాగము కూడ ముద్రింపబడుట శ్లాఘనీయము.

బాబా పదేపదే తన అవతార ప్రకటన గావించినప్పటికీ, షిర్డీ సాయిబాబాది సద్గురువులు ఆయన అవతారతత్వమును ధృవపరచినప్పటికీ, మానవాళి ఆ సనాతనుని గుర్తించలేకున్నది కాలమే వారి దివ్య సనాతనత్వమును నిరూపించుట పూర్వావతారములలో జరిగిన విషయమే.

వారి ప్రేమికులకు యెనలేని అనుభూతులు, మహత్తులు కలిగినప్పటికీ, అవి వారిపైనున్న ప్రేమ వలననే జరిగినవనీ తాను స్వయంగా ఎట్టి మహత్తులు చేయలేదని బాబా చెప్పేవారు. Mastery in Servitude వారి విధానమై యున్నది.

మానవాళికి సహవాస కార్యక్రమములద్వారా, దర్శన, ఆలింగన, ప్రసాద వినియోగములద్వారా ఆధ్యాత్మిక పురోగతిని కలుగజేసిరి. మండలి సభ్యులతో గడిపిన జీవన విధానము, అతి స్వల్ప విషయములలో సైతం చూపిన శ్రద్ధ, క్రమశిక్షణ మున్నగునవి హృదయ పరివర్తనకు దారితీసిన సంఘటనలు. కుల మత విచక్షణ లేకుండా, కుష్ఠురోగులకు, బీదలకు స్వయంగా చేసిన సేవలు నిస్సందేహంగా మానవాతీతమైన దివ్య కార్యక్రమములే.

జీవాత్మలు జ్ఞానోదయము పొంది, పరమాత్మలో ఐక్యమగుటే, సృష్టి కార్యక్రమమనీ, ఈ కార్యభారము ఎట్లు గావించిరో మానవాళిని ఆవరించుకున్న అజ్ఞానాంధకారమును ఎట్లుపటాపంచలు చేసిరో ఈ గ్రంథంలో సవివరంగా రచయిత సులభశైలిలో అందరికీ తేటతెల్లమగు రీతిలో విపులీకరించారు.

చీకు చింతలనే చీడపురుగులకు ప్రవేశమిస్తే హృదయ దౌర్బల్యము కలిగించి, దురాశ, దురహంకారములను ప్రజ్వలింపచేసి, మారణ హోమమునకు దారితీయును. సంతుష్టి జీవితముతో, సత్ప్రవర్తనతో ప్రవర్తించుచూ తన కొంగు జారవిడువక అంటిపెట్టుకొని వుండువారికి సుఖ శాంతులు లభింపచేసి, జీవిత పరమావధియైన ఆత్మ సాక్షాత్కారము గాపం చెదనని బాబా అభయమిచ్చారు.

అవతారుడే యావత్ప్రపంచమును నడిపించు లీలామానుషుడు. వారి యిచ్ఛకు అనువుగా నిలిచినవారికి సర్వ భాగ్యభోగ్యములేగాక సుఖశాంతులు లభింపచేసి మానవాళికి మేలు కలుగచేయగలరు. ఎల్లకాలములందు వారి స్మరణలో, ప్రియతముడు నిరూపించిన జీవితలక్ష్యములలో గడుపుటకు ఈ సంకలనం వుపకరించగలదు.

మెహెరవతారుని లీలావిశేషములు అత్యద్భుతంగా సామాన్యుడు సైతం అవగాహన చేసుకొను రీతిలో, యీ సంకలనమందు వివరించబడినవి. సంఘటనలే కాక వాటి అంతరార్థము సులభముగా తెలుసుకొను రీతిలో యీ గ్రంథరచన సాగింది.

ఈ రెండవభాగము ప్రచురణ భాగ్యమూ మా సెంటరుకు లభింపచేసి 13వ అమరతిథి సందర్భంలో మెహెరాబాదు కొండపై ప్రియతముని దివ్య సమాధి సన్నిధిలో ఆవిష్కరించబడుట, అవతారుడు, మచిలీపట్నం సెంటరుకు లభింపచేసిన వరప్రసాదముగా భావిస్తూ కృతికర్త శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావుకు నా ప్రేమాభివందనములు తెలుపుచున్నాను.

అవతార్ మెహెర్‌బాబాకి జై!

మెహెరాబాద్,
31-1-82.

తాడేపల్లి బసవయ్య
సెక్రటరీ
అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు.

# నా విన్నపము

ప్రియతమ మెహెర్ ప్రభువు, నిస్సందేహంగా అవతార పురుషుడనే ప్రగాఢవిశ్వాసం మనలో పాతుకొనియున్నది. అందుకే ఆయనయొక్క లీలా విశేషాలు. అద్భుత సంఘటనలు మనము తెలుసుకొనగలిగినచో భగవంతుని స్మరించినవారము కాగలము. అట్టి దివ్యావతారుని స్మరణ మన నిత్య కర్తవ్యమనే భావంతో అశేష ప్రేమికలోకానికి అవతారుని లీలా విశేషాలను అందించి, ప్రియతమునికి సన్నిహితులుగా చేయు సంకల్పంతో మెహెర్‌బాబా జీవిత విశేషాలను సంక్షిప్తంగా సులభశైలిలో మెహెర్ కథామంజరి మొదటిభాగం ప్రచురింపబడింది.

అవతార్ మెహెర్‌బాబా లీలావిశేషాలు క్రొత్తగా తెలుసుకొనగోరే ప్రేమికులకు అత్యంత వుపయుక్తంగా వుండవలయునను సంకల్పంతో యదార్థంగా జరిగిన కొన్ని సంఘటనలను తెలుగుదేశంలోని ఆయన ప్రేమికులకు అందజేయు నుద్దేశముతో మెహెర్ కథామంజరి రెండవభాగం సంకలనము చేయబడినది.

నిజానికి బాబా ఏ లీలలు ఎరుకతో చేయలేదని అనేకసార్లు చెప్పియున్నా. ఆయనను అత్యంత గాఢంగా ప్రేమించి విధేయతతో భజించుటవలన కలిగే లీలలన్నీ ప్రేమికునియొక్క విశ్వాసమునుబట్టి బహిర్గతమగు అనుభవములగుచున్నవి.

ఈ చిన్ని పుస్తకంలో ఆయన ప్రేమవలన, వారి నామస్మరణ ఫలితంగా జరిగిన అద్భుతములేకాక, అవతారుడుగా, మన యిష్టసఖుడుగా

ప్రియతముడుగా ఆయన మనలో అంతరంగిక మేలుకొలుపు గావించిన లీలలను గురించి వివరించబడినది

1-11-81 వ తేదీన ప్రధమ సంపుటం ఆవిష్కరణ సందర్భంలో వుదయంనుండి తుఫాను హెచ్చరికలెన్నో రేడియోద్వారా వినిపిస్తున్నా ఆకాశమంతా మేఘావృత్తమైవున్నా లెక్కచేయక మచిలీపట్నం మెహెర్ బాబా ఆడిటోరియంలో బహిరంగ ప్రదేశంలో ఆనాటి కార్యక్రమాన్ని ప్రియతమునిపై విశ్వాసంతో నిర్వహిస్తే నిర్విఘ్నంగా కొనసాగిపోవట అందరిని ఆశ్చర్యపరచింది. ఇది ఆ ప్రభువుయొక్క లీలకాక యింకేమి కాగలదు?

సో॥ విలియం లీపేజీ తాను ప్రచురించిన Not we but one మరియు It So Happend అనే గ్రంథములలోని కొన్ని సంఘట నలు ఆంధ్రీకరించుటకు అనుమతించినందుకు వారికి నా కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

మెహెర్ కథామంజరి గ్రంథమును అవతార్ మెహెర్‌బాబా మచిలీ పట్నం సెంటర్‌వారు దయతో ప్రచురించినందుకు వారికి నా ధన్యవాదములు. నన్నీ సంకలనానికి ప్రోత్సహించి ప్రచురణ పూర్తిఅగువరకు చేయూత నిచ్చిన సో॥ తాడేపల్లి బసవయ్య సో॥ ఇమ్మడి మధుసూధనరావు, సో॥ పింగళి దుర్గాప్రసాదరావు తదితరులకు నా కృతజ్ఞతాభివందనములు.

ఎన్ని వత్తిడిపనులున్నా అనతికాలంలో యీ గ్రంథాన్ని అచ్చొత్తించి అందించిన డీసెంట్ గంగాప్రెస్ వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సహృదయులయిన ప్రేమికలోకం, నా తొలిరచనను ప్రోత్సహించి నట్లే యీ రెండవభాగం కూడ స్వీకరించి, అవతారుని ప్రేమకు పాత్రులు కాగోరుచున్నాను.

బాబా సేవలో

మచిలీపట్నం — జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

31-1-82

# అభినందనలు

అవతార్ మెహెర్‌బాబా అంటే ఎవరో కాదు. మనకు పైవాడు కాదు. మనవాడు, మనలోవాడు, మనందరివాడూనూ. మౌనంతోనే మన హృదయాలతో మాట్లాడేవాడు. అవతార్ మెహెర్‌బాబా ఏ మతానికి చెందినవారు కాదు. ఏ మతాన్ని స్థాపించడానికి కూడ వచ్చినవారు అంతకన్నా కాదు. ఆయన దయాస్వరూపుడు, ప్రేమసాగరుడు. ప్రేమయే ఆయన మతము. మెహెర్‌బాబా నలభై మూడేళ్ళకుపైగా అఖండమౌనాన్ని ధరించి మానవాళి హృదయాలలో ప్రేమదీపం వెలిగించినవాడు. బాబాయే మౌనం. అదే ఆయన యిప్పటి అవతార విశిష్టత.

అయితే ఈ మౌనస్వరూపుని ఎలా మనమాటల్లో అందరికీ అందచెయ్యాలి? బాబా మౌనంలోంచి వచ్చిన పరమసత్యాన్ని ఎలా సులభంగా ప్రజలకు సుబోధకం చెయ్యాలి? అనేదే చంద్రమౌళీశ్వరరావు తపన. అప్పుడెప్పుడో "పరమేశా! గంగవిడువు పార్వతిచాలున్" అని మహాకవి అర్థిస్తే పరమేశ్వరుడు అనుగ్రహించాడు. ఇప్పుడు మామూలు, సాధారణ బాబా ప్రేమికుడు చంద్రమౌళీశ్వరరావు "బాబా! బాబా!" అని సర్వాత్మనా వేడుకుంటే, బాబా ఆయన మొర ఆలకించి, ఆ ప్రేమికుని హృదయంలో ప్రవేశించి, కనిపించి, మాటల్ని విడిపించి, మనకు వినిపించేలా చేశాడు. అదే ఈ పుస్తకరూపం. లేకపోతే ఆ బాబాయొక్క పరబ్రహ్మపరమాత్మ

స్థితిఎక్కడ? దానిని యింత చిన్న మాటల్లో పాఠకహృదయాల్లో స్పృశిం చేలా చెప్పడం ఎక్కడ? ఆ ధన్యత చంద్రమౌళీశ్వరరావుకే దక్కింది.

అవతార్ మెహెర్ బాబా గురించి చాలా పుస్తకాలొచ్చాయి. పెద్ద పెద్ద సంపుటాలున్నాయి. అయితే పెద్ద సాహిత్యజ్ఞానం లేనివారికయినా చిన్నపిల్లలకు సయితం, అర్ధమయ్యేలా తెలుగు పాఠకులకు పట్టుమని పది గంటలు చదివితే చాలు హృదయానికి హత్తుకొనేలా వున్నదీపుస్తకం అంతేకాదు విషయం అమూల్యమయినా పుస్తకం అందరికీ అందుబాటులో వుండే ధర కలిగివుంది. మరో విశేషమేమంటే బాబా జీవిత చరిత్రతోపాటు బాబా చెప్పిన నిగూఢ ఆధ్యాత్మిక సూక్తుల్ని యదార్ధ సంఘటనలతో మేళ వించి విషయాన్ని సులభగ్రాహ్యం చేసిన ప్రావీణ్యత యీ పుస్తకంసొత్తు. అదే రచయిత సాధించిన మెహెర్ కథామంజరి రచన చదవండి మీకే తెలుస్తుంది. నేను చెప్పడం దేనికి?

విజయవాడ,
31-1-1982.

ఈశ్వర లక్ష్మీ భగీరధరావు,
మెహెర్ బాబా కోఠీ సెంటరు,
హైదరాబాదు.

8.A



1-11-1981 న మెహెర్ కథామంజరి మొదటిభాగం ఆవిష్కరణ సందర్భంగా రచయిత శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావును సన్మానిస్తున్న శ్రీ కూరాళ్ళ పుల్లయ్య.

8.B



మెహెర్ కథామంజరి మొదటి భాగం ఆవిష్కరణ సభ
ప్రసంగిస్తున్నవారిలో శ్రీ తాడేపల్లి బసవయ్య, శ్రీ జి. రామకోటేశ్వరరావు
కూర్చున్నవారిలో రచయితతోపాటు శ్రీ పోతుకూచి నాగేశ్వరశర్మ,
శ్రీ పై మాణిక్యాలరావు, శ్రీ చిత్తజల్లు నాగేశ్వరరావు,
శ్రీ ఇ. ఎల్. భగీరథరావుగారలున్నారు.



# ౧

# మెహెర్ లీల

పంచ సద్గురువుల సమాగమప్రాప్తితో అవతార్ మెహెర్‌బాబా సప్త భూమికలు అధిరోహించి, దివ్యోన్మాదస్థితిని పొంది, తుదకు స్వావస్థకు వచ్చారు. ఇట్లు భగవత్సాక్షాత్కారము పొందిన తరువాత తిరిగి సాధారణ స్థితికి చేరుటకు ఆధ్యాత్మిక బాధానుభూతిని ఎంతగానో బాబా అనుభవించారు.

ఆ రోజులలో తల్లి షిరీన్‌మయి, బాబాపడే ఆధ్యాత్మిక వ్యథను, సాధారణ శారీరక బాధలుగా భ్రమించి, అతడు ఏదయినా యావృత్తి పెంచుకొని ఉద్యోగ బాధ్యత వహిస్తే స్థిమితపడగలడని భావించింది. ఏదయినా జీవనోపాధి కలిగించే వృత్తిగాని, వ్యాపారముగాని చేయమని కుమారునకు నచ్చచెప్పేది. బాబా వయస్సప్పుడు 22 సంవత్సరాలు. చెప్పగా చెప్పగా తల్లి పోరుతో చివరకు బాబా ఆమె చెప్పినట్లు చేయుటకు ప్రయత్నించారు.

మూడుసార్లు బాబా ఉద్యోగం సంపాదించారు. అయితే ఏ పనిలోను ఎక్కువరోజులు నిలువలేదు. ఆధ్యాత్మిక ఆవేశముకల ఒక అస్థిరుని పాత్రను బాబా ఆనాడు పోషించక తప్పినదికాదు. ఆ తరువాత బాబా పలురకముల

ఉద్యోగాలు చేశారు. 1916లో కాన్ ఖటావ్ అనే నాటక కంపెనీపెట్టి దాని వ్యవస్థాపకుడుగా బాబా నియమితులయినారు. ఈ కంపెనీ పెట్టిన రెండు నెలల లోనే దాని అధికారి మరణించుటతో ఆ కంపెనీ ఎత్తివేయవలసి వచ్చినది.

తన తండ్రి అప్పట్లో పూనాలో ఒక "టీ" అంగడి నడుపుతుండే వాడు. ఒకసారి అనారోగ్య కారణంతో చికిత్సకై తండ్రి బొంబాయి వెళ్ళ వలసి వచ్చినది. అందుచేత ఆ "టీ" అంగడిని బాబా నడుపవలసివచ్చినది. బాబా అజమాయిషీలో ఈ టీ అంగడి అంత లాభదాయకంగా నడవలేదు. తన మనస్సును వ్యాపారముపై లగ్నంచేయక, ఎక్కువగా ఏకాంతవాస ములో గడుపుటచేత, కొతాదారులు మోసం చేసేవారు.

తండ్రి షెరియార్జీ చికిత్సానంతరం బొంబాయినుండి తిరిగివచ్చిన తరువాత టీ అంగడి లాభసాటిగాలేదని ఎత్తివేసి, దానిస్థానే "సారా" దుకాణం పెట్టారు. మేహెర్ బాబాను కూడ ఈ దుకాణం చూడమని ఒప్ప జెప్పెను. టీ దుకాణంలో మాదిరే యిందులోగూడ కొతాదారులు బాబాను మోసపుచ్చేవారు.

ఇదిగూడా లాభంలేదని తలచి, బెహ్రెంజీ అనే స్నేహితునితో వాటాకలసి బాబా స్వంతంగా "కల్లంగడి"ని ప్రారంభించెను. మెహెర్, బెహ్రెంజీలు ఈ కల్లంగడికి భాగస్వాములు. ఉదయం 6 గంటల నుండి మధ్యాహ్నం 12 గంటలవరకు సీసాలు కడుగుట, నేల శుభ్రంచేయుట కొతాదారులకు కల్లు సప్లయిచేయుట బాబా వంతు. ఆయన కల్లువ్యాపారం చేస్తున్నాడేకాని, "కల్లు మత్తుపానీయమని, ఆరోగ్యానికి హానికరమని, త్రాగవద్దని" తన దుకాణానికి వచ్చే కొతాదారులకు బోధించేవారు.

ఈలోగా సహాయ నిరాకరణోద్యమం వచ్చింది. సారాషాపులు, కల్లంగడులు పికెటింగు చేయబడ్డాయి. ఈ సమయంలో బాబా తన షాపును పూర్తిగా ఎత్తివేశారు. ఇక్కడ ముఖ్యంగా గమనించతగిన విశేషమొకటి వున్నది. తాను సాక్షాత్తు ఆ దైవమే అయినప్పుడు ఇన్ని నీచమయిన పనులు చేయుటకు కారణమేమిటి? అని ప్రశ్న రావచ్చు. అందుకే బాబాయే స్వయ ముగా ఇలా చెప్పారు, "నేను వున్నతమయిన ఆధ్యాత్మికస్థాయి యందుం

దుటచేత నీచాతి నీచమయిన పనులు సయితం అలవరుచుకోవలసి వచ్చినది" అన్నారు.

మానవరూపధారియైన భగవంతుడు కావున, అవతారపురుషుడు తన వ్యక్తిత్వమందు భగవంతుని విశ్వచైతన్యము, మానవుని పరిమిత చైతన్యము కూడ ఒకే సమయమందు కలిగియున్న విచిత్రమయిన ద్వంద సంయోగము. ఆయనలో భగవంతునికి చెందిన అనంతశక్తియు, మానవునికి సహజమయిన బలహీనతయు కలిసియున్నవి. మానవుల బాధలు ఆయన భరించుటచేత అమితంగా బాధపడేవారు.

అందుకే "మానవులందరికొరకు నేను పడే బాధకంటే ఘనమైనదీ, మహిమాన్వితమయినదీ ఇంకేదీలేదు" అన్నారు బాబా.

కుల, మత వర్ణాదిభేద భావాలతో కుమిలిపోతున్న మానవజాతికి వెలుగుచూపించి, సర్వమత సామరస్యాన్ని ప్రతిష్టించి "నేను బోధించుటకు రాలేదు, మేల్కొల్పుటకే వచ్చితిని" అని ఉచ్చరించారు బాబా.

శుష్క కర్మకాండలను తిరస్కరించి "తానే రాముడను, కృష్ణుడను క్రీస్తును, మహమ్మదును, జోరాష్టరును" అని తన దివ్య సనాతసత్వాన్ని ప్రకటించారు.

"నేను సనాతనుడనని నమ్ముడు. మీరు చూసే ఈ శరీరము నేను కాను. మీ వద్దకు వచ్చునప్పుడు మీకు గోచరించుటకు వేసికొనెడి చొక్కా వంటిది మాత్రమే ఈ నా శరీరము. ఈ స్థూలదేహమందే నేను బంధింపబడి యుండలేదు. నన్నర్థము చేసుకొనుటకు ప్రయత్నింపకుడు. నా లోతును మీరూహింపజాలరు. నన్ను కేవలం ప్రేమింపుడు" అని ప్రజావళిను త్తేజపరుస్తూ ఆధ్యాత్మిక పథంలో చెయ్యిపట్టుకు నడిపారు బాబా.

కోరికలతో, ఆశలతో, షరతులతో తనను ప్రేమించవద్దన్నారు. తన ప్రేమికులెంతటి కష్టములెదుర్కొన్నను తన కొంగు జారవిడువక గట్టిగా పట్టుకొని వుండమన్నారు.

అవతార పురుషుని దివ్యలీలలు దురూహ్యములు. దివ్యచక్షువులున్న కాని చూడలేము. అరిషడ్వర్గములకు వశీభూతులై వున్న బద్ధజీవుల నుద్ధ

రించుటకే అవతారుని రాకకు ప్రధానకారణం. బద్దజీవుల ముఖ్యస్వరూపం అహంకారం. అంటే స్వార్థం, స్వాతిశయం, నేను నాది అనేవి అహంకార లక్షణాలు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు దానికి ప్రధాన శిరస్సులు. ఇట్టి బద్ధజీవుల కాత్మ ప్రబోధము చేయుటకే భగవంతుడీ యుగంలో మేహెరవతారుడై ప్రేమావతారునిగా ధరిసై అవతరించాడు.

తన అవతార కాలంలో చాలా ప్రాపంచిక వ్యవహారములు సలుపుచూ, ఆత్మ ప్రబోధకరములు, విశ్వకళ్యాణ కరములునగు అనేక బోధలను, దీర్ఘ కాలము మౌనమందే వుండి, కేవలం సౌంజ్ఞలద్వారా నిర్మల ప్రేమతో ప్రబోధము చేశారు.

అనేక జన్మల సముపార్జితములైన తన ప్రేమికుల శిష్యుల సంస్కారములను తన అవ్యాజానుగ్రహ ప్రారభంతో నశింపచేసి, ఆత్మప్రబోధము కావించిన సంఘటనలు మేహెరవతార కాలంలో కోకొల్లలు. బాబా తన శిష్యుల ద్వారా సర్వమానవాళికి లోక సంగ్రహరూపమగు ఆధ్యాత్మిక కార్య సాధనలో మేల్కొలుపు కలిగించి, తన చిన్మయ చేష్టలద్వారా వారి నెట్లు అహంకార బంధ విముక్తులను కావించారో కొన్ని సంఘటనలను ప్రేమికుల ముందుంచుటకు ప్రయత్నిస్తాను.

## జగద్రక్షకుడు

సర్వరక్షకుడు, భగవంతుడు, అవతార్ మేహెర్ బాబాతో సహజీవనం గడిపిన శిష్యులు, ఆయనను కలుసుకున్న ప్రేమికులనేకులు. ముఖ్యముగా గమనించదగిన విశేషమొక్కటున్నది. సాక్షాత్తు భగవంతుడు దైవ మానవునిగా అవతరించిన, పరిపూర్ణమగు మానవత్వము దైవత్వము కూడ ఒకే వ్యక్తియందు మలచబడుట అవగాహన కాగలదు. అందుకే మేహెరవతా

రుని జీవితం అతి సామాన్యంగా పైకి కనబడినప్పటికీ దుర్భేద్యమను, ఆధ్యాత్మిక రహస్యంతో నిండి అయోమయపరచును.

ఆయనయందుద్భవించు సమస్తము ఆశ్చర్యము గొల్పును. అయినప్పటికీ ఆయన అతి సామాన్యునిగ, స్వార్థరహిత మానవునిగా ప్రస్ఫుటమగును. ఆయనయొక్క స్థిరత్వము, అంతములేని ఏకత్వము ఎట్టి పరిస్థితులలోను మార్పుచెందక సహజరీతిలో కొనసాగును. యథార్థానికి ఈ స్థితి మానవ మేధ కతీతమైనది. మానవ భూమికకు ఆయన స్థితి అతీతమైనప్పటికీ, ఆయన తోటివారికి సహజ మిత్రుడు. ప్రతివారియొక్క ఆత్మకు, హృదయానికి చెలికాడు. అవిశ్రాంతంగా విశ్వకార్యక్రమం చేస్తున్నా, దైవికంగా ఆయన ఎప్పుడూ విశ్రాంతిగానే వుంటారు.

1949 జనవరి మొదటివారంలో మేహెర్‌బాబా ఆధ్యాత్మిక బాటసారులు (మస్తులు) కార్యక్రమాన్ని పునఃప్రారంభం చేశారు. రాజస్తానుకు దక్షిణంగా వున్న ఆరావళి పర్వతాలలో ప్రసిద్ధిగాంచిన "మౌంటు అబూ" అనే చిన్న వేసవి విడిదిని తన తాత్కాలిక ముఖ్య కేంద్రంగా ఎంచుకున్నారు. మౌంటు అబూ లో బాబా మస్తు కార్యక్రమాన్ని కొద్దిమంది శిష్యులతో దాదాపు మూడు నెలలపాటు కొనసాగించారు. ఎందరో ప్రముఖులయిన మస్తులను, సాధువులను ఈ కాలంలో బాబా కలుపుకొని వారిలో ఆధ్యాత్మిక మేల్కొలుపు గావించారు.

అత్యంత కష్టతరమైన ఈ మస్తు పర్యటనా కార్యక్రమాన్ని పరిసమాప్తం గావించుకొని, 1949 జూన్‌నాటికి బాబా మౌంటు అబూ నుండి మెహెరాబాదుకు తిరుగుప్రయాణమైనారు. జూన్ మాసాంతంలో అత్యంత ప్రధానమయిన ఏకాంతవాస కార్యక్రమం ప్రారంభించుటకు బాబా నిశ్చయించుకున్నారు. అందుచేత, సముద్ర తీరంలో కొద్దిరోజులు విరామంగా విశ్రాంతి తీసుకోవాలని సంకల్పించారు. అయితే బాబా కార్యక్రమాలలో విశ్రాంతికీ, విశ్రాంతి లేకుండుటకు తేడా కనపడదు.

బాబా తాను సంకల్పించిన విశ్రాంతికి బొంబాయికి దక్షిణంగావున్న రత్నగిరి జిల్లాలోని "వెంగుర్ల" అనేవూరును ఎంచుకున్నారు. సమీపంలో

వున్న ప్రభుత్వ అతిధి గృహాన్ని కొద్ది రోజులపాటు బాబా బృందంతో వుండుటకు రిజర్వ్ చేయబడినది. కేవలం కొద్దిమంది శిష్యులుమాత్రమే బాబాతో వున్నారు.

ఒకరోజు ఉదయం బాబా శిష్యులను వెంటబెట్టుకుని, సముద్రములో ఈదుటకు వెళ్ళారు. దూరంగావున్న నిర్జన ఏకాంత ప్రదేశమొకటి వారి ఈతలాడుటకు నిర్దేశించబడింది. శిష్యులకు చక్కని సమయం దొరికింది. బాబాతోసహా మండలివారు ఆనందంగా సముద్రంలో ఈదులాడుతున్నారు. కొద్దిసేపయిన తదుపరి బాబా మండలివారిని ఈతలాడుట కొనసాగించమని వారిని వదలివేసి తాను విశ్రాంతి భవనానికి తిరుగుముఖం పట్టారు. బంగళా అక్కడకు చాలాదూరం వున్నది.

మధ్యాహ్నం భోజనవేళకు ముందుగా తానొక మస్తును కలవాలని బాబా సంకల్పించి, ఈరుచ్‌ని వెంటబెట్టుకొని తక్కిన శిష్యులను ఈదుతూ వుండమని వదలివేసి కాలినడకన ప్రయాణమైనారు. పట్టణంలోని తమ బంగళాకు చేరుటకు చాలాదూరం నడువవలసి వున్నది. అందుచేత అడ్డదారిన త్వరగా చేరు వుద్దేశ్యంతో సముద్రంలో కలిసే మురుగుకాల్వనుదాటి దగ్గరదారంటే వెళ్ళాలని సంకల్పించారు.

కొందరు పల్లెకారుల పిల్లలు, తాటిబొందును (దీనినే డోంగీ అంటారు) నావలా ఆ మురుగుకాల్వలో త్రిప్పుచూ బాబాను, ఈరుచ్‌ని తమ డోంగీపై అవలఒడ్డుకు చేరుస్తాం రమ్మనమని ఆహ్వానించారు. ప్రవాహం వడిగానూ, లోతుగానూ వున్ననూ, అంతా కంపుకొడుతూ బహు దుర్గంధంగా వున్న జలప్రవాహం అది.

ఈరుచ్ ముందుగానే పిల్లలతో జాగ్రత్తగా దాటించమని హెచ్చరించి, బాబా అనుమతితో తాను, బాబా ఆ డోంగీలో ఎక్కారు. పిల్లలు డోంగీని ఆవలి ఒడ్డుకు చేర్చుటకుగాను తెడ్డువేస్తూ నడుపుతున్నారు. కొద్దిసేపు అంతా సక్రమంగానే జరిగింది. అంతలో డోంగీలోనున్న పిల్లలను ఏడిపించాలనే తలంపుతో వారి మిత్రులుకొందరు గబగబ ఈదుకుంటూ వచ్చి డోంగీపై పడి దానిని అటూఇటూ వూపమొదలిడిరి. ఏమి జరుగునో

వూహించునంతలో, డోంగీ తిరగబడి అందులోని పిల్లలతోసహా బాబా ఈరుచ్ లు ప్రవాహంలో మునిగిపోయారు. అయితే అదృష్టవశాత్తు వారిరువురూ ఒకేచోట ప్రవాహంలో పడుటవలన ఈరుచ్, బాబా జబ్బను పట్టుకొని ఒక చేతితో బాబాను నీటినుండి పైకిలేపి రెండవచేతితో ఆయన అక్షర ఫలకాన్ని, తోలుసంచిని పట్టుకుని తన కాళ్ళతో యీదుకుంటూ ఒడ్డుకుచేరారు.

వారిరువురు బాగా బురదనీటితో తడిసిపోయారు. బట్టలన్నీ బురదగా వున్నాయి. ఈరుచ్‌ని వెంటనే బంగళాకు పరుగునవెళ్ళి మంచిబట్టలు తెమ్మనమని పంపారు. అంత యీరుచ్ చేరువులోనేవున్న ఒక పాత భవనం సమీపంలో ఏకాంతంగావున్న ఒక చెట్టుక్రింద ఆయనను కూర్చుండబెట్టి బురదబట్టలతోనే తాను దాదాపు మైలుదూరంలోవున్న బంగళాకు పరుగెత్తాడు.

మండలివారు ఆ సమయానికి బంగళాకు తిరిగిరానందున స్నానాల దొడ్డిద్వారా ఆయన గదిలోకి ప్రవేశించి తలుపులు తెరచుకొని ఆయన బట్టలు తీసుకొని తనబట్టలు మార్చుకొనకుండా తిరిగి వేగంగా ఆయన వద్దకు పరుగున చేరాడు

ఆయన ఎంతో ఆనందంతో చెట్టుక్రింద కనిపించారు. ఆ సందర్భములో యీరుచ్ "తనకు గుర్తున్నంతలో, మండలిలో ఏ ఒక్కరు చెంత లేకుండా ఆయనను ఒక్కరినే ఒంటరిగా నిర్జనప్రదేశంలో వదలివుంచుట యిదే ప్రథమం" అంటాడు.

ఈరుచ్ సమీపంలోనున్న నొక బావినుండి మంచినీరుతెచ్చి, ఆయన శరీరాన్ని శుభ్రపరచి, దుస్తులు మార్చుకొనుటలో సహాయపడ్డాడు. ఈరుచ్ మాత్రం బురదతోనున్న తన బట్టలు యింకా మార్చుకొనలేదు. అయితే ఏదోవిధంగా వారిరువురు పట్టణంవైపు బయలుదేరి ఆయన తలచిన మస్తును సకాలంలో కలుసుకోగలిగారు.

ఆయన అత్యంతానంద పరవశులైవున్న తరుణంలో ఈరుచ్‌తో యిలా అన్నారు. "ఈనాడు నీవు యీ మురికి ప్రవాహంనుండి బయట

పడునట్లు అదుకున్నాను కనుక, ఏదో ఒకరోజున నేను నిన్ను దుర్గంధ భూయిష్టమయిన మాయనుండి బయటపడునట్లు చేసెదను" అన్నారు. ఎటువంటి వాంఛనీయమగు హామియో చూడండి! అందుకే ఆయన జగద్రక్షకుడు.

## విధేయత

ప్రజలు సత్యాన్ని కర్మకాండలద్వారా పొంద ప్రయత్నించుట, పూజలు, యజ్ఞాలు, మంత్రాలు ఆచరించువారు నిర్ణీతమైన గడువులేకుండా పయనించే రవాణా రైలువంటివారన్నారు బాబా. ఎవరైతే ప్రాపంచిక లబ్ధి కోరి గురువు నాశ్రయించి, స్థిరంగా విధేయతతో భగవంతుని ధ్యానిస్తారో లేదా మానవసేవలో తమ జీవితాన్ని అంకితం చేస్తారో. వారు నియమిత కాలం ప్రకారం ప్రతి స్టేషనులో ఆగే "ప్యాసింజరు రైలు" వంటి వారన్నారు.

అయితే అవతారుని విశ్వాసంతో అనుసరిస్తూ ఆయన ఆజ్ఞలన్నిటినీ అత్యంత విధేయతతో ఏట్టి ఫలాపేక్ష లేక పాటిస్తారో వారు ఏస్టేషనులోను ఆగక తన గమ్యస్థానం చేర్చే "ప్రత్యేక రైలు" వంటివారన్నారు!

"రాగికి చింతపండు తగిలితేగాని మెరుపురాదు. అలాగే ఒక సద్గురువు యొక్క చేతులలో గాని దుష్టుడికి (అజ్ఞానికి) మెరుగు రాదు. మరి చింతపండును రాగిమీద వేసి రుద్దినప్పుడే దానికి మెరుగు వస్తుంది. ఆలాగే సద్గురువుకూడా అట్టి దుష్టుడు (అజ్ఞాని) తన సమక్షంలోనికి వస్తే గాని కఠిన నియమాలతో తగు మెరుగుబెట్టజాలడు. ఒక వ్యక్తి జ్ఞానవంతుడు కావలయునన్నచో కావలసినది బోధలు కాదు, ఆచరణ కావాలి యితరులకు సలహాలిచ్చే చతురత జ్ఞానమనిపించుకోదు." అని చెప్పారు బాబా.

"కర్మ సిద్ధాంతం - సంస్కార ఫలాలు" అనే చక్రంలో బంధింప బడ్డాం మనం. మరి యిట్టి చక్రబంధం నుండి బయటపడాలంటే, విముక్తి సాధించాలంటే ప్రియతముని సదా స్మరిస్తూ ఆయనకు విధేయులమైవుండాలి. అయితే అట్టి విధేయత అలవడేముందు, మార్గంలో అనేక అనుభూతులు కలుగుతాయి. అవి అత్యంత ఆకర్షణీయమై మోసపూరితంగా వుంటాయి. అహంభావం వాటి ప్రత్యేకత. మనం వాటి చిత్తులలో పడక జాగ్రత్త పడితే విధేయతకలవాటు పడగలం. ఒకవేళ ఈ అనుభూతులకు ప్రాధాన్యత నిచ్చామో, ఆ వెంటనే మనకు బంధములేర్పడతాయి. కనుక వాటి వెంట పరుగెత్తక భగవంతుని యెడల ప్రేమతో విధేయులమై వుండాలి. మనకు ఆయన వుద్బోధించే దివ్యబోధ యిదే.

ఈ విషయం బాగా అవగాహన అగుటకు ఒక చక్కని సంఘటన పరిశీలిద్దాం. అవి ఆయన స్త్రీ పురుష మండలితో జబ్బల్‌పూర్‌లో క్రొత్తగా ఆశ్రమం స్థాపించిన రోజులు. స్త్రీ మండలి, పురుషమండలి రెండు వేర్వేరు బంగళాలలో వుండేవారు. ఈరుచ్ తల్లి గయ్‌మాయి, కారావాలా భార్య, బాబా తల్లి షిరీన్‌మాయి, రానోగాలే, ఆమె తల్లి యింకా అనేకమంది స్త్రీ మండలిలో వున్నారు.

ఆశ్రమంలో ఆహార నియమం పాటించేవారు. కేవలం శాకాహారం మాత్రమే అనుమతించబడేది. మాంసాహారం పూర్తిగా నిషిద్ధం. నిత్యం ఆయన వంటకాలను తనిఖీ చేసేవారు. బజారునుండి తెచ్చే ప్రతి పార్శిలు పరిశీలించేవారు.

షిరీన్మాయికి ఆయన యొక్క ఆధ్యాత్మిక ఔన్నత్యం పైన అంత విశ్వాసం వుండేది కాదు. ఆశ్రమంలో వున్న స్త్రీ పురుష మండలి సభ్యులందరూ తన కుమారుడయిన మేర్వానును పిచ్చివాడుగా మార్చటానికి వచ్చిన తిండిపోతులుగా భావించేది.

అయితే ఆయన ఒక్క మండలివారికే కాక తన తల్లికికూడా కొరకరాని కొయ్యవంటివారు. ఆయన విధేయతకు అత్యంత ప్రాధాన్యం

యిచ్చేవారు. ఆయన ముందుగానే తక్కిన మండలితో తన తల్లిని గురించి చెపుతూ ఆమె మాత్రం యితరులకు విధించిన షరతులన్నిటికీ అతీతముగా వుంటుందని చెప్పారు. అయినప్పటికీ ఆహారం విషయంలో నిబంధనలు విధిగా పాటించబడుచున్నవి.

షిరీన్‌మాయికి చేపలంటే మహా యిష్టం. అందునా అరేబియా సముద్రపు చేపలంటే ఆమెకు అమిత యిష్టం. ఒకసారి ఆయన మస్తు కార్యక్రమంలో కొందరు శిష్యులను తీసుకొని ఆశ్రమం వదలి వెళ్ళారు. అది మంచి అవకాశముగా తీసుకొని షిరీన్‌బాయ్ తన జిహ్వాచాపల్యం తీర్చుకుందుకు చేపలకూర తినాలనుకుంది. వెంటనే బొంబాయినుండి శ్రీమతి కేరావాలా సహాయంతో చేపలు తెప్పించుకొని, గుమగుమలాడే చేపలకూర వండించుకుని తినటను కూర్చున్నది! అంతలో తెరచివున్న కిటికీగుండా అయిదు పిల్లులు గభాలున గదిలోకి దూకి ఆమె పళ్ళెంపై ఎగబడినవి. ఆమెపైబడి గీరి, రక్కి నానాహింస పెట్టి చివరకు అవి వండిపెట్టుకున్న చేపలకూర అంతా ఆరగించి వుడాయించినాయి. ఈ హఠాత్సంఘటనతో దిగ్భ్రాంతి చెందిన షిరీన్‌మాయి తనను కటిక వుపవాసం వుంచుటకు అదంతా ఆయన చేసిన పనే అనుకున్నది కాని అది తన అవిధేయతగా గ్రహించలేకపోయింది.

ఆయన తిరిగివచ్చినతరువాత జరిగినసంగతి వెల్లడయినది ఇందులో తమవంతు పాత్ర జరిపినందుకు యీరుచ్ తల్లిని, కారావాలా భార్యను ఆయన మందలించారు. షిరీన్‌బాయి కల్పించుకొని "మేర్వాన్! నిన్ను కన్నతల్లిని నేను కనుక నాయందు సుహృద్భావంతో వుండ"మన్నది. అందుకు ఆయన "అసలు నీవు నాద్వారానే యీ ప్రస్తుత వునికిని పొంది యున్నావు" అని ఆమెకు జ్ఞానోదయం కలిగించారు. దానితో షిరీన్‌మాయి యదార్థ విధేయత అంటే సరియగు అర్థాన్ని గ్రహించగలిగింది.

## సమర్పణ

బాబా తన రాకను గురించి వివరిస్తూ "నేను మీ మధ్యకు మీరంతా నాముందు సాష్టాంగ పడుటకు, నాకు హారతిపట్టుటకు, నన్ను పొగడుటకు లేదా నన్ను పూజించుటకు రాలేదు. ఇట్టివి యోగులకు సాధువులకు, మునులకు మంచివి. నేను మీనుండి వీటన్నిటికంటే అధికమైనది కోరుతున్నాను. నేను మీయందు నా ప్రేమను ప్రసరించి మీనుండి మీ ప్రేమను పొందుటకు వచ్చియున్నాను."

"నేను మీ స్థితికి దిగివచ్చుటకు కారణం, నా ప్రేమను మీయందు ప్రసరింపజేసి, తద్వారా మీరు భగవంతుని ప్రేమించి భగవంతునిగా మారగలుగుటకు మాత్రమే నా రాక. మిగిలినదంతా మాయ. కావున మీరు నానుండి ప్రేమను తప్ప మరిదేనిని కోరకుడు."

అందుకే ఆధ్యాత్మిక పథంలో అతిముఖ్యమయిన విషయాలు మూడున్నవి. వీటిలో "ప్రేమ" అనేది భగవంతుడు మానవునికిచ్చే బహుమానం. "విధేయత" సద్గురువు మానవునికిచ్చే బహుమతి. "సమర్పణ" మానవుడు సద్గురువునకు సమర్పించుకొనే కైంకర్యం.

భగవంతుని ప్రేమించువాడు ప్రియతమునితో ఐక్యం కాంక్షిస్తాడు. విధేయత ప్రియతముని యిచ్ఛను పొందును. అనగా ప్రియతముని ఆనందమును వాంఛించును. సమర్పణ మరిదేనిని కోరదు. ప్రియతముని యిచ్ఛకు బద్ధుడై సర్వము పరిత్యజించును.

ఎవరయితే ప్రేమిస్తారో వారు ప్రియతమునికి ప్రేమికులు. విధేయుడయినవారు ప్రియతమునికి ప్రియతములు. తను, మన సర్వస్వాన్ని త్యజించినవారు ప్రియతమునిలో తానే వుండును. తానే ప్రియతమునిగా భాసించును.

కావున ప్రేమకంటే, గొప్పది విధేయత. విధేయతకంటే గొప్పది సమర్పణ. ప్రేమ అనుభవించుటేగానీ యితరులకు చెప్పేదికాదు. బహిర్గతపరిచేది ప్రేమ కానేరదు.

తన ఆరోగ్యం, సంపద, కుటుంబసంక్షేమం హితాభిలాషుల క్షేమం మొదలగునవి కాంక్షించి ఆయనను ప్రేమిస్తే అది అట్టివాటిని సాధించుటకు గాని ఆయనను ప్రేమించినట్లు కానేరదు.

అందుకే ఆయన తరచూ చెప్పేవారు. "నేను మీకు నా ప్రేమ నందించి మీనుండి ప్రేమను కోరుటకే వచ్చియున్నాను. మీరు నన్ను ప్రేమించవలసినంతగా ప్రేమించలేరని నాకు తెలుసు. దాని నాచరించుటకు ముందు మీరు ప్రేమ బహుమానాన్ని స్వీకరించాలి. మరి ఆ బహుమతి నా యిచ్ఛపై ఆధారపడివుంటుంది" అన్నారు. ఏ ఒక్కరుకూడా అట్టి యిచ్ఛా పూర్వక బహుమతిరూపంలో తప్ప మరే మార్గంద్వారా కూడ అట్టిప్రేమను పొందజాలరు.

ఈ విధంగా ఆయనను ప్రేమించవలసిన రీతిలో ప్రేమించి తానాసించిన సమస్తము ఆయనలోనే చూడగలిగి ఆయన ప్రేమ బహుమానానికి ఆయన యిచ్ఛకు పాత్రురాలయిన ఒక ధన్యజీవియొక్క సంఘటన గురించి తెలుసుకుందాం.

ఉత్తర భారతంలో ఒకరోజున యిది యథార్థంగా జరిగిన విశేషం. మేహేర్‌బాబా కొద్దిమంది శిష్యులతో మస్తు పర్యాటనలో వున్నారు. ఆనాడు బాబా విడిదిచేసిన యింటి ప్రాంగణంలో ముందున్న వరండాలో కూర్చుని వున్నారు. ఆయన ప్రక్కనే యీరుచ్ వున్నాడు.

అది సంధ్యాసమయం. గోధూళివేళయినది మిగత మండలివారు లోపల రాత్రి భోజనానికి కూర్చున్నారు. ఆయన మాత్రం బయట వరండాలో కూర్చుని యీరుచ్‌ని తన దగ్గర నిలబడమన్నారు. అంతలో హఠాతుగా ఒక గంతుకురాలు, నడివయస్సులోవున్న యువతి వీరున్న ప్రాంగణంలో ప్రవేశించి తొట్రుపాటుతో బాబాను సమీపించింది.

వచ్చీరాగానే ఆయన పాదాలపై సాష్టాంగపడి అశ్రునయనాలతో తన గోడు వినిపించసాగింది. "బాబా నేను చాల దుఃఖంలో వున్నాను.

విన్నొక విషయంలో ప్రాధేయపడుటకు నీ వద్దకు వచ్చాను. నీవు సాక్షాత్తు అవతారమూర్తివని విని. దుఃఖంలోవున్న నాకు నీవు సహాయపడగలవని విశ్వసించి నీచెంతకు వచ్చాను నాకు సహాయం చేయమని ప్రార్థిస్తున్నాను" అన్నది

అంత బాబా తనచేతులతో ఆమెను పైకిలేపి, "ఏమిటది? నానుండి నీవేమి కోరుకుంటున్నావు చెప్పు?" అని అడిగారు.

అప్పుడామె తన కథనిలా చెప్పింది.

ఉత్తర భారతదేశంలోని పంజాబు రాష్ట్రంలో తానొకానొక రాష్ట్రానికి రాణియట. ఆమె కుమార్తె పొరుగుననున్న మరొక పతగణాకు చెందిన యువరాజును వివాహమాడినదట. తన కుమార్తె అతిలోక సౌందర్యవతి అగుటచేత తన అల్లుడామెను ఎంతో గాఢంగా ప్రేమించేవాడు. కొంత కాలానికికామె గర్భవతి అయింది. హిందూసాంప్రదాయం ప్రకారం తొలి కాన్పులో పురుడు పోయుటకు అమ్మాయిని పుట్టింటికి తీసుకువచ్చారు.

అయితే దురదృష్టవసాత్తు పురిటిలో కాన్పు కష్టమై పాపమాచిన్నది మరణించింది. కుమార్తె మరణంతో తల్లి ఎంతో తల్లడిల్లిపోయి మనోవ్యథ చెందినటు చెబుతున్నది అంత ఆయన మధ్యలో కల్పించుకొని, "నీ కుమార్తె ఎప్పుడు మరణించింది?" అని ప్రశ్నించారు. "బాబా యిప్పటికి ఆరునెలలైనది నాబిడ్డపోయి" అన్నది.

"ఆరునెలలా?" అన్నారు. "అవును" అన్నది. "అయితే మంచిది సరే, నీ కథ యిహ కొనసాగించు" అన్నారు. అంతట తల్లి తన గాథ చెప్పడం కొనసాగించింది.

అల్లుడు తన కూతురిని అతిగాఢంగా ప్రేమించుటచేత, భార్య మృతికి తల్లే కారణమని నెపంవేశాడు. కానుపుకు ముందు తల్లి కొంత శ్రద్ధవహించి సరియగు చికిత్స చేయించివుంటే తన భార్య మరణించి వుండేదికాదని అల్లుడి అభిప్రాయం. కానుపు సమయంలో వారు అజాగ్రత్తగా వుండుటచేతనే ప్రాణాపాయం సంభవించిందని అల్లుడు అత్తగారిని ఆడిపోసుకున్నాడు.

ఆ విషయం జ్ఞప్తికి తెచ్చుకొని ఆ తల్లి బాబాతో "బాబా! నేనలా అజాగ్రత్తగా వుండుటకు ఎంతమాత్రం అవకాశం లేదు. ఆమె నా స్వంత కూతురు గదా! అందునా నేనామెను ఎంతగానో ఆప్యాయతతో గారాబంగా పెంచాను. గాఢంగా ప్రేమించాను. ఓహో! బాబా! నేను నా కూతురుని అన్యాయంగా పొట్టన పెట్టుకొన్నాను. ఆమె లేకుండా నేను జీవించలేను. ఆమెను గురించిన ఆలోచనలు, జ్ఞాపకాలు నన్ను వెన్నాడుతున్నాయి. మరువలేకున్నాను." అంటూ విలపించసాగింది

"అయితే నీకేమి కావాలి?" అంటూ ఆయన వూరడించారు. "నా కుమార్తె నాకు తిరిగి కావాలి. నీవు దివ్య సనాతనుడవు. మానవరూపంలో వున్న భగవంతుడవు. సాక్షాత్తూ పరమేశ్వరుడవు! నీకు అజేయమైనదేదీ లేదు. నీవు నా కుమార్తెను తిరిగి నాకు యివ్వగలవు. ఏం బాబా? నీవు యివ్వలేవా?" అంటూ వినయంగా ప్రార్థించింది

"తప్పక, నేను నీ కుమార్తెను నీకు యివ్వగలను." అని ఆయన అభయమిచ్చారు. "నిజంగానా? బాబా! ఆమె తిరిగి తన సహజ రూపంలో వస్తుందా? నీవామెను బ్రతికించెదవా?" అని సంభ్రమాశ్చర్యములతో వుక్కిరిబిక్కిరయినది.

"కావచ్చును!" అన్నారు ఆయన ముక్తసరిగా. "బాబా! నేను వింటున్నది నిజామా? కలా? నేను లోగా ప్రేమించిన అదేరూపంలో నా కుమార్తెను తిరిగి చూడగలనా? గాఢంగా ప్రేమించిన నా కుమార్తెను అదే రూపంలో పునరుజ్జీవింప చేస్తావా?" అని తిరిగి ఆయనను ప్రశ్నించింది. "అవును" అన్నారు ఆయన.

బాబా అభయం పొందిన ఆ తల్లి స్తబ్ధురాలయింది. చెంతనున్న యారుచ్ మరీ స్తబ్ధుడయినాడు. ఇటువంటి సంఘటన శిష్యులెవరూ అంతకుముందు ఎదుర్కొనలేదు. మాయలు గాని, ఇంద్రజాలము గాని ఆయన ఎన్నడూ ప్రోత్సహించలేదు. చచ్చిపోయినవారిని బ్రతికించుట అద్భుత ఘటన కాదనేవారు. తాను చేసే అద్భుతం మరణించినవారిని

బ్రతికించుట కాక, మానవులను మాయకు మరణించునట్లు చేస్తాననేవారు. అంధులకు దృష్టి ప్రసాదించుటకు నేను రాలేదన్నారు. అయితే మానవులను మాయకు లోనుగాకుండా యుండుటకు అంధులుగా చేయుటకు వచ్చితినన్నారు.

అయితే ఆశ్చర్యంగా ఆయన యెన్నడో ఆరునెలల క్రితం మరణించిన రాణీ కూతురుని బ్రతికిస్తానని అభయహస్తమిచ్చేసరికి యీరుచ్కి అగమ్యమై అచేతనుడయినాడు. విషయమేమాత్రం అర్థంకాలేదు.

అంతలో ఆయన ఆమెతో "అవును! నేను నీ కుమార్తెను ఒక షరతుమీద నీకు తిరిగి యిస్తాను. అందుకు ప్రతిఫలంగా నీవు చేయవలసినదల్లా నన్ను ప్రేమించాలి ఎల్లప్పుడూ నన్ను జ్ఞాపకం పెట్టుకోవాలి. విడువకుండా నన్ను గుర్తుంచుకోవాలి. నీవెంత ప్రేమించగలిగితే అంతగా ప్రేమించగలగాలి. ఇంకా, ఇంకా రోజురోజూ గాఢంగా ప్రేమించు బాగా గుర్తుంచుకో! మరి నీవలా చేయగలవా?" అని ప్రశ్నించారు.

"తప్పకుండా చేస్తాను బాబా!" అన్నది. వాగ్దానము చేయమని అడిగారు. అలాగేనని ఆమె వాగ్దానం చేసింది మళ్ళీ ఆయన ఆమెకు జ్ఞాపకం చేశారు. కేవలం తనను ప్రేమించమని. ఎంతో ఎక్కువగా, యింకా అమితంగా గుర్తుంచుకోమని మరీమరీ చెప్పారు.

అది విని ఆమె ఎంతో సంతోషించింది. ఎంతో హాయిని అనుభవించింది. ఒక్కక్షణంలో పూర్తిగా మారిపోయింది. హృదయం తేలికపడి ఉల్లసితవదన అయింది ఆయన మాటలయందు ఆమెకు పూర్తి విశ్వాసం కుదిరింది. ఆయనను మళ్ళీ అడిగింది. "అయితే నా కుమార్తె రాకకుముందు నాకేదయినా నిదర్శనం కనబడుతుందా?"

"అవును తప్పక కనబడుతుంది. ముందుగా నీవామెను కలలో చూడగలవు. అదే ఆమె రాకకు నిదర్శనం" అన్నారు. దానితో ఆమె మరీ

తృప్తిపడింది. బాబాను ఆలింగనం చేసుకున్నది. తనివితీరా దర్శనం పొందింది. ఆమెను ఆయన ఆశీర్వదించారు. కృతజ్ఞతాపూర్వకంగా మళ్ళీ బాబాముందు సాష్టాంగపడి, నమస్కరించి వెళ్ళిపోయింది.

సరే! ఇలా కొంతకాలం గడిచిపోయింది. బాబా తన దర్శనానికి ప్రజలను అనుమతించిన ప్రతిసారీ ఈ మాతృమూర్తి కూడ వచ్చేది. వచ్చిన ప్రతిసారీ ఆమె తననెంతగా ప్రేమిస్తున్నదీ విచారించేవారు. ఆమె తనను ప్రేమించేవిధానం, ఎలా గుర్తుంచుకుంటున్నదీ అన్నీ వివరంగా అడిగేవారు. ఆమెను ఒకటేఅడిగేవారు. "బాగా గుర్తుంచుకో! నీవు నీ కుమార్తెను తిరిగి పొందగలవని నేను వాగ్దానం చేసియున్నానుగదా! మరి నీవామెను ముందుగా కలలో చూసితివా?"

"లేదు బాబా!"

"అయితే ఒకటిమాత్రం జ్ఞాపకం వుంచుకో! నీ వెప్పుడయితే నీ కూతురుని కలలో చూచెదవో ఆ వెంటనే ఆమెను నీవు పొందగలవు. నేనొకసారి అలా చెప్పానంటే అది జరిగితీరుతుంది" అన్నారు.

మరికొన్ని సంవత్సరాలు గడిచినవి. ఒకసారి ఆమె ఆయన సమక్షంలో "నేను నా కుమార్తెను కలలో చూచాను" అన్నది. "అహా! ఐతే అది నీవు నీ కుమార్తెను పొందుటకు అవుసరమగు సిసలయిన నిదర్శనం" అన్నారు. అందుకామె సంతోషపడి ఆనందంతో యింటికి వెళ్ళిపోయింది. ఈ విషయాన్ని మొదటినుంచీ గమనిస్తున్న యీరుచ్ కి అంతా అగమ్యగోచరంగా వుంది. ఇప్పుడీ విషయంవిని గందరగోళం చెందాడు. ఏమి జరుగనున్నదోగదా అని ఆలోచనలో పడ్డాడు.

ఇది జరిగిన తరువాత ఆమెలో అంతరంగికంగా ఏమి జరిగిందో కానీ, ఆమె అప్పటికంటే ఆయనపై ప్రేమను అమితంగా పెంచుకొంది. నిజం చెప్పాలంటే ఆమె పూర్తిగా బాబా ప్రేమలో నిమగ్నమయింది. మండలివారెవ్వరికీ యీ సంగతి తెలియదు.

ఒక సంవత్సరం గడిచినతరువాత మరో అవకాశం దొరికి, ఆమె ఆయనవద్దకు వచ్చింది. అప్పుడు ఆయన మండలితో పూనా గురుప్రసాదు బంగళాలో వున్నారు. ఆమె వచ్చీరాగానే ఆయనకు ప్రణమిల్లి వినయంతో నిలబడింది. "ఎలావున్నావు?" అని అడిగారు. చాలా సుఖంగా వున్నాను" అన్నది.

క్షణం ఆమెవయిపు తీక్షణంగా చూచి, హఠాత్తుగా ఆమెతో "యీ క్షణంలో నన్ను ఎవరు ఏమి అడిగినా యిచ్చుటకు సిద్ధముగా వున్నాను. త్వరగా యిప్పుడే కోరుకో, నీ కోరిక తీరుస్తాను" అన్నారు. అంతట ఆమె ఆయన పాదములకు నమస్కరించి "నాకు నీవే కావాలి బాబా" అన్నది.

అందుకు ఆయన ఎంతో సంతోషించారు. "అయితే నీవిప్పుడు నిజంగా నీ కూతురును పొందావు. నాలో నీ కుమార్తెతోపాటు సర్వ జగత్తునూ పొందగలిగి వున్నావు" అన్నారు.

దీనిని బట్టి మనమొక విషయం గమనించవచ్చును. చివరకు జరుగ బోయేదేదో బాబాకు ముందుగానే తెలుసును అంతరంగిక ప్రేరణ కల్పించుటలో, ఆయన ఎలాంటి మానసికశాస్త్ర గురువో గ్రహించవచ్చును.

తనను ప్రేమించుటలో, ఆమె తన కుమార్తెను తిరిగి పొందాలనే తలంపు యింకా దృఢతపరచి ఆయనను యింకా గాఢంగా ప్రేమించు నటుల చేసింది. అలాంటి గాఢమైన ప్రేమ ఆమె మనస్సులో యింకా పాతుకుపోయి క్రమంగా కుమార్తె రూపం మరుగయిపోయింది.

కేవలం ఆయన రూపం, ఆయన ప్రేమ ఆమె మనస్సులో పాదు కున్నవి. కాలక్రమేణా కుమార్తెను పూర్తిగా మరచిపోయింది. ఆయన్నే గుర్తుంచుకొని, సర్వజ్ఞుడయిన ఆయనలో తన కుమార్తెను చూసుకోగలిగిన ధన్యజీవి, నీ కుమార్తె తిరిగి వస్తుందిలే! అని వాగ్దానం చేయుటలో

ఆయన అభిమతమిదే. బాబాను వదులుకొని తప్పిపోకుండా వుంటే, ఆమె కుమార్తె తప్పకవస్తుందన్న మాట.

అప్పటినుండి ఆ తల్లి ఆయన సన్నిధికి తరచూ వస్తూవుండేది. వచ్చిన ప్రతిసారీ, ఆయనామెను ఏడిపించేవారు. వూరికే సతాయించేవారు. అందుకామె ప్రాధేయపడుతూ "బాబా! నాతో ఆడుకోవద్దు. నేను నా కుమార్తెను తిరిగి పోగొట్టుకోలేను. నాకు నీవున్నావు. అంతేచాలు. నేను నా కుమార్తె కొరకు యింక వెతకనక్కరలేదు. సర్వవ్యాపకుడు నాతోనే వున్నాడు. సర్వమూ ఆయనలోనే వున్నది. నాతోపాటు నీయందున్న కుమార్తెను కలిగివున్నాను. నన్నేడిపించి, నా బాబాతో నన్ను దూరం చేయవద్దని" ప్రాధేయపడింది.

ప్రియతముని యిచ్ఛ, ప్రేమికుని విధేయత ఎంత చక్కగా నిరూపించబడినదో మన మీ సంఘటనలో గమనించవచ్చును.

## విశ్వాసం

ఒక వ్యక్తి తన కోర్కెలవలన అనేక బాధలను అనుభవించుచున్నప్పుడు అతడు వాటియొక్క సహజసిద్ధ సత్యాన్ని గ్రహించగలడు. అట్టి కష్టములను అనుభవించునప్పుడు సంతోషంగా వాటిని ఆహ్వానించాలి. కష్టమనునది, తదుపరి రానున్న కష్టములను తుడిచివేయుటకే సంభవించును. ఈ విషయాన్ని వివరిస్తూ ఆయన ఇలా అన్నారు.

"విరిగిన ముల్లును వేరొక ముల్లుతోనే తీయాలి అంటే ఒక కష్టము మరొక కష్టముతో తొలగించుట అన్నమాట. ఆత్మ తన కోరికల సాధనకు తపించునప్పుడు కష్టములు సంభవించును. అనగా రోగి వ్యాధి నిర్మూలనకు ఔషధసేవ ఎలా అవసరమో అలాగునే కోరికల సాధనకు కష్టములు అవసరమన్నమాట.

"కష్టాలన్నీ చెడ్డవికావు. నిష్కామమయిన శాశ్వతసుఖాన్ని పొందుటకు, కష్టములు మార్గదర్శకమయినప్పుడు అది ఎంతో అదృష్టంగా భావించాలి. ఎంతోకాలంగా విలపిస్తూ ఉన్న బాధనుండి విముక్తిపొందుటకు రోగి డాక్టర్ చేతిలో శస్త్రచికిత్స చేయించుకుంటూ అనుభవించే బాధవంటిదానిని, ఆత్మ తన కోర్కెలు త్యజించుట అనే బాధను, కోరికలవలన కలిగే అంతములేని బాధలనుండి విముక్తిపడుటకు ఆహ్వానించాలి."

"ఆత్మకు తన కోర్కెలు త్యజించుట చాల కష్టతరము కావచ్చును. కానీ నిజానికది ఎంతో తేలిక. నీ శరీరముపై ఒక వ్రణము ఉద్భవించిన దనుకొనుడు. దానిని శస్త్రచికిత్స చేయునప్పుడు ఎంతో బాధ కలిగించును.

తదుపరి వెంటనే ఎంతో సుఖాన్ని కలుగచేయును. అదేమాదిరి కోరికలు త్యజించుటవలన కలిగేబాధలు దానివెంట అనుసరించివచ్చే సుఖం, స్వేచ్ఛాజీవనం, శాశ్వతానందం యివన్నీ కలుగజేయును.

కొందరు తమ ప్రాపంచిక లాభంకోరి అనగా ఆర్థికస్థితి మెరుగుపడుటకో అనారోగ్యంనుండి విముక్తికోరియో సద్గురు సాంగత్యం అభిలషిస్తారు. అయితే సద్గురువు సమస్తము సమకూర్చగల సర్వశక్తిమంతుడయినప్పుడు ఆయన ఆజ్ఞలను విధేయతతో పాటిస్తే ఆశించిన ఫలితం పొందిన భావన వారికో కలుగవచ్చును. కానీ బాబా సాధారణంగా మనము ఎదుర్కొనే యాతనబాధలు, వ్యాధులు, కష్టాలు, దుఃఖాలు యివన్నీ మన గతజన్మల ఫలితంగా అనుభవించుటకు నిర్ణయించబడ్డవనీ భగవంతునిచే నిర్ణయించబడిన వీటినుండి తప్పించమని కోరుట, బలవంతము చేయుటే కాక ఆయనచే నిర్దేశించబడిన చట్టాన్ని రద్దుచేయమని ఒత్తిడిచేయుట కాగలదని అన్నారు.

"ఈ విశ్వంలో ఆధ్యాత్మికరంగం అంతా ఒక చక్కని చట్టరీత్యా నడుపబడుచున్నది. అదే కార్యకారణ చట్టం. ఇది అత్యంత ప్రధానమైన చట్టంగనుక అందరూ దీనిని విధిగా పాటించితీరాలి" అన్నారు బాబా.

"ఆకాలంలో అలౌకిక సంఘటనలద్వారా జరిగే శారీరక రుగ్మతల నివారణ ఆధ్యాత్మికపరమగు బాధ నివారణకు అవరోధము కావచ్చును. యిష్టపూర్వకంగా శారీరక, మానసిక రుగ్మతలు, బాధలు భరించగలవాడు. ఆధ్యాత్మికబాధా నివృత్తిపొందగలడు. శారీరక మానసిక బాధలు భగవంతు డిచ్చే బహుమతులుగా భావించాలి. అట్టిబాధలు నీవు సంతోషంతో అంగీక రిస్తే అవి నిన్ను శాశ్వతసౌఖ్యము పొందుటకు దారితీయును" అని చెప్పారు ఆయన.

గురువుయిచ్చే ఆజ్ఞలపై విశ్వాసంలేనివాడు ఆ గురువు నాశ్రయించి నందువలన ఫలితమేమీవుండదంటారు ఆయన. ఈ విషయాన్నే మరో విధంగా చెప్పారు.

"మనము ఎంతటి యాతిబాధలలో వున్నప్పటికీ వ్యాధిగ్రస్తులుగానో కుటుంబ కష్టాలలోనో వున్నప్పటికీ అట్టిబాధలన్నిటిని విధేయతతో అనుభ వించినప్పుడే దైవకృపకు పాత్రులుకాగలమంటారు ఆయన. ప్రతిదీ ఆయన చేతిలోనే వున్నది. మనమాయన కృపను పొందుటకై సమర్పించుకొనతగిన అత్యుత్తమ నివేదన, విధేయత. సమస్తబాధలూ మనోనిబ్బరంతో భరించ గలగాలంటే ప్రేమ పురస్సర విధేయత, అనితర విశ్వాసం అవసరం. ఈ సందర్భాన్ని వివరించుటకొక చక్కని సంఘటన.

ఇది 1959వ సంవత్సరములో జరిగింది. ఆయనకు ఒక వ్యక్తి యొక్క సమీపబంధువులనుండి ఒకదానివెంట ఒకటిగా అనేక తంతులు, వ్యాధిగ్రస్తుడై బాధపడుతున్న ఆ వ్యక్తికి వెంటనే స్వస్థత చేకూర్చమని ఆయన ఆశీర్వాదం కోరుతూ వచ్చినవి. ఆ వ్యక్తిపేరు ప్లీడరు. ఇతడు ఒకప్పుడు ఆయనతో కలసి, అనుసరించి ఆయనకు విధేయుడై తనకు తాను సమర్పించుకున్నాడు.

ఆ రోజులలో ఆయన అతడిని ఒక చీకటిగదిలో ఏకాంతవాసం, మౌనం మూడేళ్ళపాటు పాటించునట్లు చేశారు. ఒకసారి చిన్న క్యాబిన్‌లో

ఏకాంతవాసంలో వుండగా ఒక కోడెత్రాచు లోనికి ప్రవేశించి అతడిపైన ప్రాకి మెడకు చుట్టుకున్నప్పటికీ అతడు గురువాజ్ఞకు విధేయుడై చలించ లేదు. ఎంతటి ప్రమాదపరిస్థితిలో వున్నప్పటికి, మనసును గురువునందే లగ్నం చేసుకొనగలిగినందున భయంకర సర్పంకూడ అతనినేమీ చేయక తన దారినఅది వెడలిపోయింది.

అయితే యిక్కడ అతడి విధేయత పరీక్షించబడినది. అతడి విధే యతలో, స్వార్థంతో కూడిన ఫలాపేక్ష వున్నట్లు ఆయన గ్రహించారు. "నీకేం కావాలన్నారు ఆయన. అందుకు ప్లీడరు 'బాబా! నీ కృపను నా యందు ప్రసరించి, సాక్షాత్కార భాగ్యాన్ని ప్రసాదించమని అర్థించాడు. అందుకు ఆయన ప్లీడరుకు ఒక హితోపదేశం చేశారు. "తానిచ్చే ఒకే ఒక్క బహుమానం అంతిమ సాక్షాత్కారము మరి అది అంతా తన ఇచ్ఛపై ఆధారపడి వుంటుంది. దానిని ఎటువంటి ఒత్తిడులవలన సాధించ లేరు. శిష్యుడు ఎక్కడవున్నా, ఎంతటి కష్టసమయాల్లో కూడ తనపై విశ్వాసంతో వుంటే, తన యిచ్ఛకు పాత్రుడయి దానిని పొందగలడని" బాబా చెప్పారు.

బాబా హితోక్తులు విన్న ప్లీడరులో ఆలోచనలు రేకెత్తినయి. మరి అలా అయినచో, తాను బాబా వద్దనే ఎందుకు వుండాలి? ఎక్కడైనా వుండవచ్చునుకదా! బాబాపై విశ్వాసముంచుటే కదా కావలసినది?" అని మనసులో తర్కించుకొని ఇంటికి వెళ్ళిపోవుటకు నిశ్చయించుకున్నాడు. అదే విషయాన్ని బాబాకు చెప్పగా, బాబా వెళ్ళిపోవుటకు అనుజ్ఞ ఇచ్చారు. అవకాశం వచ్చిన ప్రతిసారీ వచ్చి బాబాను దర్శనం చేసుకు వెళ్ళేవాడు.

కొంతకాలమయిన తర్వాత అతనిలో వింత వ్యాధి అంకురించి, ఎన్ని వైద్యములు చేయించినా తగ్గలేదు. అతడు యెంత వ్యాధిగ్రస్తుడై యున్నప్పటికీ బాబా యందు విశ్వాసంతో వున్నాడు. అతని బంధువులు ఈ వ్యాధిని బాబాయే తగ్గించాలని భావించి, అతి తరచుగా బాబాకు అతడి వ్యాధిని తగ్గించమని జాబులు వ్రాశేవారు, ఎన్ని జాబులు వ్రాసినా, తంతులు

పంపినా బాబా నుండి జవాబు రానందున, వారికి ఆయనయందు విశ్వాసము సన్నగిల్లింది. ఆయన దైవత్వాన్ని శంకించారు.

జబ్బు బాధను తట్టుకోలేక చివరకు ప్లీడరు కూడా "బాబా ఇహ నన్ని బాధనుండి విముక్తుడిని చేయి. లేదా నాకు చావన్నా రప్పించు!" అంటూ వ్రాసుకున్నాడు. బాబా కరుణామయుడు. హృదయంతో పిలిస్తే పలుకుతాడు. వెంటనే ప్లీడరును బొంబాయినుండి, మెహెరాబాద్ రప్పించారు. డాక్టరు గోహెర్‌కు రోగిని ఒప్పగించి, అతడికి సకల వుపచారములు చేసి వైద్యం జాగ్రత్తగా చేయమన్నారు. వ్యాధి బాగా ముదిరిపోయింది. అన్ని జాగ్రత్తలు తీసుకొనబడుతున్నవి. ఆయన స్వయంగా రోజూ అతడి దగ్గరకు వచ్చి కొంతసేపు గడుపుతున్నారు.

ఒక వారం గడిచిన తరువాత, బాబా అతడిని అంబులెన్సులో మెహెరాబాదు తీసుకువెళ్ళి డా॥ డాన్‌కిన్‌కి ఒప్పగించారు. ప్లీడరు తన ఆరోగ్య పరిస్థితిని గ్రహించాడు. మరి ఎంతోకాలం బ్రతకనని అనుకున్నాడు. అందుచేత బాబా మెహెరాబాద్ తిరిగి వెళ్ళిపోతుంటే తన శరీరత్యాగం చేసేలోపల బాబాను మరొక్కసారి మెహెరాబాద్ వచ్చి తన దివ్య మంగళ రూప దర్శన భాగ్యం కలుగచేయమని ప్రార్థించాడు.

కరుణాసముద్రుడు బాబా. అతని కోర్కెమన్నించి అభయమిచ్చారు కొద్దిరోజులు గడవకుండానే ప్లీడరు మరణకాలం ముంచుకొచ్చింది. మరి కొద్ది సమయంలో మరణిస్తాడనగా ప్లీడరు తన సేవకునితో "గదిలో కాంతి చాలా అధికంగా వున్నది. కన్నులు మిరుమిట్లు గొలుపుతున్నవి. లైట్లు ఆర్పమ"న్నాడు. నిజానికి గదిలో లైట్లు వెలుగుటలేదు. గదిఅంతా చీకటిగావున్నదాసమయంలో. మరికొద్దిక్షణాల్లో "బాబా! బాబా!" అంటూ ప్లీడరు అంతిమశ్వాస విడిచాడు.

చూడండి! ఆయన ప్లీడరుకు ఈ జీవితంలోనే తన బహుమతిని ప్రసాదించారు. వెలుగురూపంలో సాక్షాత్కారభాగ్యం కలుగచేశారు. అది అతనికొక మధురక్షణం. తదుపరి జన్మకొక మంచిపునాది. అతని విధేయతకు భగవంతుడిచ్చిన వరం. అంతిమక్షణాల్లో ఆయనయందు విశ్వాసంతో ఆయన పావననామం వుచ్చరించినందుకు పొందిన ఫలం.

# సత్యము

ఆయన ఈ జగత్తంతయూ ఒక నాటకరంగమని యీ నాటక వేదికను తానే సృష్టించానని మనమంతా ప్రపంచం అనే నాటకంలో పాత్రధారులమని అన్నారు. మనవంతు పాత్రపోషణ శాయశక్తుల నిర్వహించినప్పుడే నాటకం రక్తికడుతుందన్నారు. మరి మనం అలా ఎప్పుడు నిర్వర్తించగలమంటే నాటకంలో మనపాత్రను శక్తివంచనలేకుండా పోషించాలనే విషయం గ్రహించినప్పుడే చేయగలం.

ఆయిన తరచు శిష్యులను ఏదో ఒక పనిలో నిమగ్నమై అందు కష్టపడి కృషిచేయమనేవారు. ఆలా పనిలో నిమగ్నమై వున్నప్పుడు "మనకీపనిని ఆయన ఒప్పగించారు. దానిని నిర్వర్తించుటే మనబాధ్యత" అనే దృష్టి వారి మనస్సులో పనిచేసేది.

దీనిని వివరిస్తూ యింకా అర్ధమగుటకు ఆయన చక్కని వుపమానం చెప్పారు. ఒకవ్యక్తి వున్నాడు. అతడొక బిచ్చగాడు. అయితే అతడు కళాపిపాసి. నాటకాలువేసేవాడు. కధలోవచ్చే పాత్రను తనవంతు కృషిచేసి చక్కగా పోషించేవాడు. నిజజీవితంలో బిచ్చగాడే అయినప్పటికీ అతడు నాటకంలో ఒక మహారాజు పాత్ర పోషించుటకు నియమించబడివున్నప్పుడు అతడు ఆరాజుపాత్రలో నిజంగా అతడా రాజువలె తనపాత్ర పుట్టిపడునట్లు పోషించాలి. ఒకరాజువలె అభినయించాలి. ఆ సమయంలో యదార్ధరాజు పాత్ర పోషించాలి. సభికులందరినీ తన రాచరిక ఠీవితో మెప్పించాలి.

మరి మనమంతా ఒక బ్రహ్మాండమైన స్టేజీమీద నాటకమాడుతున్నప్పుడు ప్రతివారు తమవంతు పాత్రను శాయశక్తులా పోషించాలి. నిష్కపటత్వము కోరునదిదే. నిజజీవితంలో నిష్కపటము, సత్యవాదనము, ఆవశ్యకములు.

ఈ విషయాన్ని వివరిస్తూ ఆయన సమక్షంలో జరిగిన కొన్ని సంఘటనలకు యీరుచ్ ఇలా వివరిస్తాడు. వ్యాపారమున్నది. యిందులోని ముఖ్య

సిద్ధాంతం ఒకరికి లాభంవస్తే మరొకరికి నష్టంతవ్వదు. వ్యాపారమంటేనే అది. ఒకరు ఎక్కువ సంపాదిస్తే తక్కువ సంపాదించినవాడు వేరొక డుండితీరాలి.

వ్యాపారంలో ముఖ్యలక్షణం కొసరికొసరి బేరమాడుట కఠినంగా వ్యవహరించి గట్టిగా బేరం చేస్తేనే వ్యాపారం. అలా చేసినప్పుడు అది కపటం క్రిందకురాదు అంటారు ఆయన. కపటం అంటే మనం అబద్ధం అనుకుంటాము. వ్యాపారంలో అది మనం అవలంభించిన పాత్ర. అబద్ధం అనేది వ్యాపారంలో సహజం, అవుసరంకూడ.

వ్యాపారంలోవున్న యిరువురు భాగస్వాములు మధ్య నిష్కపటం వుండితీరాలి. కపటం వారిమధ్య వుండరాదు. అసత్యం వ్యాపారం చేయుటలో అవుసరమైంది. వ్యాపారంచేసే భాగస్వాములమధ్య నిషిద్ధమైంది. కొంచెం లోతుకువెడితే మనం ఆయననుండి నేర్చుకున్నదేమిటో తెలియగలదు.

ఒకప్పుడొక లాయరుగారు ఆయన దగ్గరకు వచ్చారు. లాయరు వృత్తి ఏమిటో నాకు తెలుసు. మామూలుగా అంతా యదార్థసత్యాన్ని విరాదరించుట లాయరువృత్తి అనుకుంటారు. ఆయన యీ లాయరుతో ఏమి చెప్పారో తెలుసునా? "ఎంతో నిష్కపటంతో సత్యవాదిగా నీ క్లయింట్‌లకు రక్షణ కలిపించుట నీ వృత్తియొక్క నిజధర్మం. అతడు తప్పుచేసినా చేయకపోయినా నీవు వాదించాలి. పార్టీ చెప్పినదానినిబట్టి అతనికి అనుకూలంగా వాదించకపోతే నీవు అన్యాయం చేసినట్లే. ఆచారంగా వస్తున్న శాస్త్రాలు చెప్పే సత్యాన్ని ప్రకటించుటలో నీవు తప్పటడుగు వేసి అగౌరవపరచినట్లు కాగలదు."

"చివరివరకు నీవాతని తరపున వాదించాలి. సందర్భోచితంగా, నీ వృత్తిధర్మం ప్రకారం ఏవిధమైన జిత్తులు అవసరమైతే అవన్నీ ఉపయోగించి అతని తరపున నీ విధిని నిర్వహించవలయును" అని హితవు చెప్పారు.

అలాగే ఒక రాబడిపన్ను గణాంకికుడు వున్నాడనుకొనుడు. తన క్లయింటు పన్నును ఎలా తగ్గించి కట్టాలో చెప్పుట అతని విధి. అంతే పన్నులు అసలు కట్టకుండా తప్పించుకొనునట్లు చేయుటకాదు. చట్ట సమ్మతమయిన పరిధిలో ఏదేని లొసుగు దొరికితే, దానిరీత్యా పన్నును ఎలా కట్టకుండా తప్పించుకొనవచ్చునో చెప్పాలి. ప్రభుత్వం సజావుగా పాలించగలగాలంటే పన్నులు సక్రమంగా అందరూ కట్టితీరాలి కదా! వృత్తిరీత్యా తన క్లయింటు పన్నులు ఎలా తగ్గించి కట్టవచ్చునో నచ్చచెప్పుట అతని విధి. అలా చెప్పకపోతే అది అతని కపటబుద్ధి అవుతుంది.

ఈ ఉదాహరణలన్నీ నిజ జీవితంలో మనం మన పాత్ర పోషణలో నిష్కపటం, సత్యం ఎలా అవుసరమో వివరిస్తున్నవి. మాట్లాడే ప్రతిమాట వెనుక నిష్కపటంతో కూడిన సత్యం. లక్ష్యంగా వుండాలి. ఈ సందర్భంలో బాబా ఒక కథ చెప్పారు.

మహ్మదు ప్రవక్త శరీర త్యాగం చేసిన తరువాత అతని సన్నిహిత శిష్యుడయిన అలీ ఒక మసీదులో వుంటూ వుండేవాడు. ఒకరోజున అలీ మసీదులోని గుమ్మంలో ఒకప్రక్కన కూర్చొని వున్నాడు. అంతలో హఠాత్తుగా అటుగా ఒక వ్యక్తి పరుగున వచ్చి అలీని రక్షించమని శరణు కోరాడు. "రక్షించండి! నా శత్రువులు నన్ను వెన్నాడుతున్నారు. నన్ను రక్షించండి" అని ప్రాధేయపడ్డాడు.

అప్పుడు అలీ అతడిని మందిరంలోనికి పొమ్మనమన్నాడు. అలా ఆ వ్యక్తి లోనికి పోగానే, అలీ తన స్థానం మార్చి, గుమ్మంలోని రెండవ వయిపుకు జరిగి కూర్చున్నాడు. తప్పుచేసిన అపరాధిని తరుముకువస్తున్న సమూహం మరి కొంత తడవులో అలీని సమీపించి, అపరాధి గుర్తులు చెపుతూ "అట్టివాడు యిటుగా వచ్చాడా?" అని ప్రశ్నించారు.

"నేనిక్కడ కూర్చున్న తరువాత, నేనట్టి అపరాధిని చూడలేదని జవాబిచ్చాడు అలీ. చూచారా! అలీ యిక్కడ ఏట్టి అసత్యాన్ని పలుకలేదు. నిజానికి అపరాధిని చూడలేదు. అందుకే బాబా అంటారు "నీవు యితరులకు సహాయపడుటకై ఏది మాట్లాడుతావో అది నిజానికి సత్యము పలికినట్లే."

## యథార్థ మరణం

ఈ విశ్వమంతా భగవంతుని కృపచే వుద్భవించినది. భగవంతుడు సత్యము. విశ్వమంతా మాయ. మాయకు జీవితం లేదు. మాయ, మాయే గాని, దాని అంతటిది ఏదీలేదు. ఈ మాయలో భగవంతుడు జీవించుచున్నాడు. జీవుడు జీవించుచున్నాడు. భగవంతుడు మాయలో జీవించుచున్నప్పటికీ, సత్యము యొక్క భగవంతుని గురించిన ఎరుక కలిగే వుండును. భగవంతుడు సర్వస్వతంత్రుడు. విశ్వమంతా ఆ భగవంతుని పయినే ఆధారపడి వున్నది. విశ్వమంతా ఎన్నటికయినా, భగవంతుని నుండి వచ్చి యున్నందున ఆ భగవంతుని యందే లయం కావలయును. మాయా ప్రభావంలో మాయ యందలి జీవులు జననమరణ చక్రంలో చిక్కుకొని, తుదకు సద్గురు కృపతో లేదా అవతారుని, యిచ్ఛకు పాత్రులై ఆ భగవంతునిలో లీనమగుదురు. ఈ సత్యాన్ని, నిరూపించుటకు సోదరి మణి చెప్పగా యీ క్రింద వివరించడమయినది.

ముఖ్యంగా మనం గమనించవలసిన విషయం బాబా సర్వజ్ఞుడు కనుక యీ విశాలవిశ్వంలోని ఆత్మలన్నీ ఆయన ఆత్మీయులే అట్టి ఆత్మలు తమ భౌతిక శరీరత్యాగం చేసినప్పుడు, అవి పొందే అవస్థ, తదుపరి దాని ఆశ్రమ స్థానం, యివన్నీ ఆయనకు విశదమగు విషయాలే. ఈ సందర్భంలో జరిగిన ఒక సంఘటన, మనకా విషయాన్ని విశదపరచగలదు.

బాబా అవతార తత్వం ప్రకటించిన తర్వాత, జోరాష్ట్రియన్ మతస్థులలో ఒక విధమగు సంచలనం ప్రారంభమైంది. బాబా చెప్పే బాధలు,

చేసే పనులు మూలంగా, ఆయన తలిదండ్రులను దాదాపు వెలివేసినంత పని చేశారు. బాబా చేసే ప్రతిపనీ విమర్శించి వాటికి ఎన్నో ఎద్దేవాలు, వ్యాఖ్యలు కల్పించి, తల్లి షిరీన్‌మాయిని సూటి పోటి మాటలతో మీ అబ్బాయి యిలా చేశాడు. అలా చేశాడు అని పితూరీలు చెప్తూ వుండేవారు.

ఒకరోజున బాబా సోదరుడు జంషెడ్జీ లండన్‌లో మరణించినట్లు, బాబాకు తంతి పంపబడినది. ఆయన సర్వజ్ఞుడు గనుక, జెంషెడ్జీ వున్నస్థితి తెలుసుకన్నారు. అందుకు సంతోషంగా, మండలివారికి, అక్కడ చేరిన వారందరికీ చాక్లెట్లు పంచిపెట్టారు. ఈ చర్యకు వూళ్ళోవున్న తోటికులం వారికి కోపం వచ్చింది. స్వంత అన్న మరణిస్తే సంతోషంగా చాక్లెట్లు పంచిపెడతాడా? అని తల్లి దగ్గరకు వెళ్ళి గేలిచేశారు. మీ అబ్బాయి నీకు తప్పపుట్టాడమ్మా మన మతాన్ని అల్లరిపాలు చేస్తున్నాడు. తన అన్న మరణిస్తే దుఃఖించకపోగా ఆనందంతో చాక్లెట్లు పంచిపెట్టాడు. ఇట్టి విడ్డూరము ఎన్నడయినా విన్నామా? అంటూ ఎత్తిపొడిచారు.

పెద్దకొడుకు మరణించాడన్న బాధలో వున్న షిరీన్‌మాయికి, యిరుగు పొరుగువారి ఎత్తిపొడుపులతో మరింత దుఃఖంవచ్చింది. వెంటనే బాబా దగ్గరకు వెళ్ళింది. "నాయనా! మీ అన్న మరణించాడు గదా మేమంతా విచారంలో వున్నాం. నీవు దుఃఖించకపోగా ఆనందంగా వున్నావు. పై పెచ్చు సంతోషంతో చాక్లెట్లు పంచుతున్నావు, యిది తగునా? మన మతస్తులు మనలను గురించి ఏమనుకుంటున్నారో గమనించావా? వారంతా నన్ను గేలి చేస్తున్నారు. బాబూ! అలా చేయుట తప్పుగదా!" అంటూ మందలించింది.

అదివిని బాబా "అమ్మా! నీకు ఎవరో తెలియనివారు అలా చెప్పియుందురు. ఇప్పుడు జంషెడ్జీ స్థితి ఎట్టిదో, అతడు ఎట్టి స్థితిని అనుభవిస్తున్నాడో నేను చూస్తున్నానమ్మా! అది నాకు తెలుసునుగనుక నాకు దుఃఖం కంటే, ఆనందం కలుగుతోంది. అందుకే చాక్లెట్లు పంచిపెట్టాను. నిజానికి యిప్పుడు జంషెడ్జీ వున్న స్థితిని నీవు తెలుసుకోగలిగితే చాక్లెట్లుకాదు పెద్ద

పెద్ద అద్దాలు చేయించి వూరంతా పంచుతావమ్మా!" అన్నారట. "అమ్మా! నిజానికి జంషెడ్జీ యిప్పుడు నాలో లీనమై వున్నాడు. యిక మను జన్మ లేని యదార్థ మరణం చెందాడు. యిందుకు మనమంతా సంతోషించాలి." అని చెప్పగా షిరీన్‌మాయి నిరుత్తరయై బాబాను కౌగలించుకొన్నదట.

## సర్వ శక్తి మయుడు

బాబా మేర్వానుగా వున్నప్పుడు ఆయన తల్లి షిరీన్‌మాయి గర్భవతిగా వున్నది. మేర్వాన్ అప్పటికి సద్గుర్విణి బాబాజాన్ స్పర్శతో దైవ సాక్షాత్కారం కలిగి, దివ్యోన్మాద స్థితిలో వున్న సమయం. స్వామ్యావస్థకు చేరుటకు వేర్వేరు సద్గురువుల సందర్శనకై యిల్లువదిలిన రోజులవి. అప్పటికి ఆమె సంతానమంతా మగబిడ్డలే. అందుకే షిరీన్‌బాను ఎప్పుడూ ఒక ఆడ నలుసన్నా కలిగితే బాగుండునని పరితపిస్తూ వుండేది. ఇంత పెద్ద సంసారం పాకుటలో కాస్త తల్లికి సహాయకారిగా వుండాలంటే ఆడపిల్ల అవసరము అని ఆమె ఎప్పుడూ భావించేది. ప్రసవవేదన ప్రారంభం కాగానే షిరీన్మాయిని హాస్పిటలులో చేర్చారు. విషయం విన్న మేర్వాన్, తిన్నగా తల్లి వున్న ఆసుపత్రికి వెళ్ళి అక్కడ తల్లికి సపర్యలు చేసే నర్సుతో "సిస్టర్! ఈసారి మా అమ్మకు ఎలాగయినా ఆడపిల్ల పుడుతుంది. జాగ్రత్తగా కాన్పు చేయమ్మా!" అనిచెప్పి వెళ్ళాడుట. "యిప్పటి వరకూ మా అమ్మకు అంతా మగపిల్లలే పుట్టారు. ఆమెకు ఆడపిల్లలమీద మక్కువ ఎక్కువగా వున్నది. అందుచేత, యీసారి మా అమ్మకు తప్పక ఆడపిల్ల పుట్టాలి," అని కూడ అన్నారుట.

మరి ఆయనకోరిక ఆశీర్వచనమైనట్లుగా ఆ కాన్పులో షిరీన్‌మాయికి ఆడపిల్లే పుట్టింది ఆమెకు మణిజయితానీ అని పేరు పెట్టారు. అప్పటి వరకు మేర్వాను అటూయిటూ తిరిగినా యింటికి మాత్రం వస్తూవుండేవాడు, మణి పుట్టిన తర్వాత, మేర్వాన్ అప్పటికే పూర్ణ చైతన్య స్థితిని చేరి

వుండుటచేత యిల్లువదలి బయటకు వెళ్ళి ఆశ్రమ జీవితం ఆరంభించారు. అప్పటివరకూ ఆడపిల్ల కావాలని పరితపించిన, షిరీన్‌మాయి, కూతురు పుట్టీ పుట్టగానే ముద్దులబిడ్డ మేర్వాన్ యిల్లువదలి వెళ్ళినందున అందు కా పిల్ల పుట్టుకే కారణమని భావించింది, దానితో కూతురంటే ఆమెకు అభిమానం సన్నగిల్లింది. ప్రతి చిన్న విషయంలోనూ మణిని విందించేది. ఒకసారి బాబా తల్లిదగ్గరకు వచ్చారు. ఆ సమయంలో చెల్లి మణి వుయ్యాలలో గుక్కపెట్టి ఏడుస్తున్నది. తల్లి వూయల వూపుతూనే కుమార్తెను "నీవు పుట్టావు, నా కొడుకు నన్ను వదిలి వెళ్ళాడు." అంటూ విందించింది. అది విన్న మేర్వాన్ తల్లిని సమీపించి "అమ్మా లేదమ్మా! మణి చాలా అదృష్టవంతురాలమ్మా! ఆమెను అనవసరంగా నిందించకమ్మా! మణి చాల అదృష్టవంతురాలు" అంటూ కాసేపు మేర్వానే స్వయంగా వూయల వూపి, ఆ తరువాత శాశ్వతంగా యిల్లువదలి వెళ్ళిపోయారట. కధ అంతా సోదరిమణి చెప్తూవుంటే మాకన్నులు చమర్చినవి. మరియు హృదయం స్పందించింది,

తల్లి షిరీన్‌మాయి గుండె దిటవు చేసుకొని, మణిని సాకి పెంచి పెద్దచేసింది, విద్యాబుద్ధులు నేర్పి ఒక యింటి దానిని చేయాలని, దాంపత్య సుఖం అనుభవిస్తుంటే చూచి ఆనందించాలని, ఆ తల్లి కాంక్ష.

అయితే చదువుకొనే రోజులలోనే మణి స్నేహితురాళ్ళతో తామంతా కన్యలుగానే వుండిపోవాలని, ఆధ్యాత్మిక భావంతో నిర్ణయించుకొన్నారు.

బాబా ఆశ్రమ జీవితం గడుపుతూ చెల్లి మణిని కూడ తనవద్దకు పంపమని తల్లికి ఎన్నోసార్లు కబురంపారు. తనకు సహాయకారిగా ఇంటివద్ద వుండాలని జవాబు పంపుతూ వుండేది. అసలే పెద్ద సంసారం. అంత పెద్ద సంసారాన్ని తానొక్కతే సాకలేక షిరీన్‌మాయి ఆడపిల్ల ఇంట్లో వుంటే తనకు సహాయకారి కాగలదని ఆరాటపడింది. అందుకే ఆశ్రమ జీవితం గడుపుటకు తన అంగీకారం తెలుపలేకపోయింది.

మణి చదువుకుంటూ యింటివద్ద తల్లికి చేదోడువాదోడుగా వుండేది. అప్పుడప్పుడూ బాబా దగ్గరకు వెళ్ళి వస్తూవుండేది. ఆయనమాత్రం మణిని శాశ్వతంగా తన ఆశ్రమంలో వుండేందుకు పంపమని తల్లిని పోరుపెడుతూ వున్నారు. ఆమె అభ్యంతరం చెబుతూనే వున్నది.

అంతలో మణికి చర్మవ్యాధి పొడచూపింది, అవతారుని లీలలు అనూహ్యములు గదా! మణి నుదుటియందు సరిగ్గా పాపిటికి తిన్నగా చిన్న "బొల్లి" మచ్చ ఏర్పడినది. మొదట్లో అట్టి మచ్చ ఏదీ లేదు. అది అకస్మాత్తుగా పొడచూపిన మచ్చ. డాక్టర్లకు చూపి వైద్యం చేయించారు. ఎన్నివైద్యాలు చేయించినా లాభం లేకపోయింది. ఆ వ్యాధిని ఎలా అరికట్టాలో ఎవరికీ అవగతంకాలేదు.

చివరికి తల్లిలో జ్ఞానోదయం కలిగింది. బాబా ఒక్కరికే ఈ వ్యాధిని అరికట్టగల శక్తి వున్నదని గ్రహించింది. దాంతో అయిష్టంగానే మణిని ఆయన ఆశ్రమానికి ఆయనతో శాశ్వతంగా వుండుటకు పంపింది. ఆయన మటుకు మణికివచ్చిన ఆ వ్యాధిని పూర్తిగా నిర్మూలింపచేయలేదు. అంతటితో ఆగిపోయి, మరిపెరగకుండా ఆగిపోయేలా చేశారు.

మణి కూడ తన మనస్సును ఎన్నడూ ఆ వ్యాధిమీదకు పోనీయ లేదు. ఆమెకు బాగా తెలుసును, సర్వశక్తిమయుడగు మెహెర్‌బాబాయే తన యిచ్ఛ కలిగినప్పుడు తానే నిర్మూలించకలడనే భావంతో ఏ ఆలోచన లేకుండా ఆ భారాన్ని ఆయనపైనే వదలివేసింది. "ఒకవేళ యీ వ్యాధిని వెంటనే నిర్మూలిస్తే మళ్ళీ అమ్మ తనను యింటికి తీసుకువెళ్ళిపోతుందేమో నని ఆయన ఆ మచ్చను తీసివేయక అలా వుంచి వుంటారు" అని మణి అనుకున్నదట.

మరి ఆ మచ్చను పూర్తిగా తీసివేయలేదు. అలాగే వుండిపోయి నందున తరువాత సంవత్సరాలలో పెద్దపెద్ద కార్యక్రమాలలో, సహవాస సమయాలలో మణి అందరిలోను కనపడవలసి వచ్చినప్పుడు ఆమె నుదుటి

మీదవున్న మచ్చ నలుగురికీ కనపడకుండా వుండేందుకు దానిపై స్నోవంటి లేపనం పూసుకొనుటకు అనుమతించేవారట.

# స ర్వాం త ర్యా మి

ఆయన తన శరీర పరిత్యాగానికి ముందు మనతో వున్నారు. శరీర పరిత్యాగం తదుపరి ఆయన మనతోనే వుండిపోయారు. ఇప్పుడు ఆయన ప్రక్కనవుండుట మనవంతు. మనకు మనమే ఆయన మిత్రులుగా, ప్రేమికులుగా వుండుట అలవాటు చేసుకోవాలి. ఆయన సాన్నిహిత్యం, ప్రేమ మనకు ఎప్పుడూ వుంటాయి. ఆయనకు సన్నిహితులుగా వుండకలుగు బాధ్యత మనపై వున్నది.

ఈ సత్యాన్ని ఎన్నో దశాబ్దాలపాటు ఆయన సేవకు అంకితమయిన మండలి సయితం మాయలోపడి విస్మరించి మరుక్షణంలోనే ప్రియతమునిచే మేల్కొల్పబడిన సంఘటనలెన్నో వున్నాయి. అట్టి సంఘటనలలో సోదరి మెహెరా అనుభవమొకటి తెలుసుకుందాం. 1969 ఫిబ్రవరి 7వ తేదీన ఆయన దివ్యశరీరాన్ని మెహెరాబాద్ కొండపైవున్న సమాధిలో నిక్షిప్తం చేసిన తరువాత స్త్రీమండలి ముఖ్యులయిన మెహెరా, మణీ మున్నగువారు మెహెరాబాద్‌లో వుండి చేసేందుకు ఏముంది? ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నారట.

ఎటూ తేల్చుకోలేని సంశయంతో ఆయనతో గడిపిన అనుభవాలు గుర్తుచేసుకుంటూ రోజులు గడుపుతున్నారు. ఆయనకు బహిర్ప్రాణమైన మెహెరా శోకతప్తయై, అవతారుని లీల అర్థం చేసుకొనుటకు ప్రయత్నిస్తూ ఆయన స్మరణతో కాలం గడుపుతోంది.

అవతారుని తత్వం, రానున్న దర్శన కార్యక్రమం గురించి ఆయన యిచ్చిన హామీ ఇంతలోనే జరిగిన హఠాత్పరిణామం, ఆయన శరీర పరి

త్యాగం సమాధిలో 7 రోజులపాటు చెక్కుచెదరని రీతిలో ఆయన దివ్య శరీరం వెలుగొందిన రీతి వీటన్నిటినీ ఒక్కొక్కటే మనసులో అన్వయించు కుంటున్నది మెహెరా.

అట్టి ఆలోచనలతో ఒకరోజున మెహేరా దృష్టి ఆయన గదికిటికీకి ఎదురుగావున్న చెట్టుయొక్క కాండముపై పడింది. ఆమె కంటికి ఆ మ్రానుపై ఆయన ప్రతిరూపం చక్కగా చేతితో ఎవరో చెక్కినట్లు కనపడింది. వెంటనే మణిని డా॥ గోహెర్‌ని పిలిచి, ఆ చెట్టుపై బాబా రూపం తన ఒక్కదానికే కనపడుతున్నదా లేక వారికికూడా కనపడుతున్నదా అని తెలుసు కొనుటకువారిని ఆ మ్రానును చూడమన్నది. వారుఆటుపై పుచూచి మ్రానుపై ఆయన ముఖం కనపడుతున్నదని చెప్పేసరికి మణిని ఆ రూపముయొక్క ఫొటో తీసి ఆదీజీ ఆఫీసుకు పంపమన్నది. ఆ ాగే మణి దాని ఫొటోలను ఎన్నో కోణాల్లో తీసి ఆ ఫిలింను డెవలప్‌చేసి కాపీలు పంపమని ఆదీజీకి పంపించింది.

దానిని ఆదీ కడిగించి ఫోటో కాపీలు తీయించి చూచి, ఆశ్చర్య పోయాడు. స్వతహాగా బాబా ప్రతిరూపం చేతితో మ్రానుపై చెక్కినట్లు ముద్ర పడింది, బాబా శరీరాన్ని సమాధిలో వుంచినప్పుడు ఆయన ముఖం మాత్రమే కనపడుతున్నట్లు వుంచారు. ఈ ప్రతిరూపం ఆ ముఖంమాదిరి గోచరించింది. దానిని చూచి, ఆదీజీ బహుశః మణియో మెహెరాయో తమ హస్త కళా నైపుణ్యంతో అలా చెక్కి వుంటారని అభిప్రాయ పడ్డాడు. అందుకు వారిని అభినందించి వద్దామని, ఆ ప్రింట్లను తానే స్వయంగా తీసుకొని మెహెరాబాద్ వెళ్ళాడు. ఆదీ మెహెరాబాద్ చేర గానే అసలు సంగతి తెలుసుకున్నాడు. అది ఎవ్వరూ చెక్కలేదని, దాని అంతట అదే అలా తయారయినదని తెలుసుకొని స్వయంగా దగ్గరకువెళ్ళి తనివితీర చూచి ఆనందించాడు.

ఆనాడు శుక్రవారం అగుటవలన, యీ విశేషాన్ని అహమ్మద్‌నగర్ సెంటరు కార్యక్రమంలో ప్రముఖంగా తన ప్రసంగంలో అందరికి తెలియ పరచెను.

ఈ వింత విన్న బాబా ప్రేమికులేకాక, అహ్మద్ నగర ప్రజలు, చుట్టుప్రక్కల గ్రామాలనుండి ప్రజలు తండోప తండాలుగా మెహెరాబాద్ చేరి బాబా రూపాన్ని ఆ ప్రమానుపై తిలకించసాగారు. అప్పుడు మండలిలో ముఖ్యులు స్త్రీ మండలికి యీ విధంగా నచ్చజెప్పారు.

"బాబా శరీరత్యాగం చేశారు కనుక యింకా యిక్కడ ఏమి వున్నదని మీరు వెళ్ళిపోవాలనుకున్నారు. బాబా తాను ఎక్కడికీ వెళ్ళలేదని, ఇక్కడే శాశ్వతంగా వుంటానని మనకు నిదర్శనం చూపారు. అందువలన మీరంతా మీ నివాసాలలో యథారీతిగా వుండవలయునని బాబా అభిలాష అది మనకు గుర్తుచేయుటకే బాబా తన దివ్య సుందర రూపాన్ని కనబరచారు."

స్త్రీ మండలికి కూడ యీ సంఘటనతో చైతన్యం కలిగినది. ఫలితంగా తమ సంకల్పం మార్చుకొని మెహెరాబాద్‌లో స్థిరపడిపోయారు.

## సర్వజ్ఞత్వము

మనం తరచుగా బాబాను గురించి మాట్లాడుకున్నప్పుడు మనలను అయోమయంలో వుంచే విషయాలు రెండున్నవి. ఆయనకు సమస్తం తెలిసినప్పటికీ ఆయనచుటూ మనచుట్టూ వుండే విషయాలు తనకు తెలియనట్లే కనపడేవారు. ఒక్కొక్కప్పుడు రాబోయేసమయంలో జరుగబోయే విషయాలు తనకు తెలుసన్నట్టు సూచనలిచ్చేవారు.

ఆయన దీనిని గురించి ఒక వివరణ చెప్పారు. తన సర్వజ్ఞత్వం గురించి విశదీకరిస్తూ, మనలను గురించి ఆయన యెరిగినదంతా బహిర్గత పరిస్తే మనమాయన సమక్షంలో మరొక్కక్షణంకూడ వుండుటకు యిచ్ఛగించమని అన్నారు. అలాచేస్తే దుస్తులుధరించి కనపడవలసిన వారి సమక్షంలో నగ్నంగా కనపడుటవంటిదట.

అనంతశక్తి, అనంతజ్ఞానము. అనంతఆనందం అనంతుడయిన భగవంతుని సొత్తు. అవి ఆయన సహజగుణాలు అనంతశక్తిని, అనంత ఆనందాన్ని భగవంతుడు మానవరూపధారియై అవతరించినప్పుడు ప్రయోగించరు. ఈ ప్రపంచం అంతటికీ కదలిక యివ్వదల్చినప్పుడు తన అనంత శక్తిని చాల అరుదుగా వుపయోగించును.

అవతార్ మెహెర్‌బాబా తన అనంత ఆనందానుభూతిని ఎన్నడూ పొందలేదు. తన అనంత జ్ఞానాన్ని మాత్రం ఆయన ఎప్పుడూ వాడేవారు. ఆయనకు సమస్తమూ ఎరుకవున్నది. అంతా తెలిసినప్పటికి బాహ్యంగా మనకు అజ్ఞానిగా కనపడుదురు. సమస్తం సంపూర్ణంగా ఆయనకు విదిత మగును.

సర్వమూ తెలిసిన ఆయన బాహ్యంగా ఏమీ తెలియనట్లున్నా ఆయన సంపూర్ణ జాగ్రదవస్థలో వుండేవారు. ఆస్థితి నిరంతరం నిరాటంకంగా సాగేది. గాఢనిద్రలో కూడ ఎరుకతోనే వుండేది. ఆయన దైవం. తనకుతానే భగవంతుడనని తెలుసును. సర్వకాల సర్వావస్థలయందు సంపూర్ణ జాగ్రద వస్థలో వుండి సర్వమూ ఎరుకతో వుండేవారు.

ఆయన సర్వజ్ఞత్వం గురించిన విశేషం ఒక సంఘటనలో ఎలా వెల్లడైనదో తెలుసుకొందాం. ఆయన ఒకసారి ఉత్తరభారతంలో శిష్యులతో పర్యటిస్తున్నారు. చాలదూరం అలసిసొలసి ప్రయాణంచేసి, ప్రొద్దుగుంకే వేళకు ఒకపట్టణం చేరారు. అది జునాగడ్ ఆ రాత్రికి అక్కడ ఆగాలని ఆయన నిశ్చయించారు. ఊళ్లో ఏమయినా విశ్రాంతి గృహాలున్నాయేమో తెలుసుకురమ్మనమని శిష్యులిద్దరిని పంపారు.

ఊరికి ప్రక్కగా చక్కని గదులున్న భవనమొకటి అద్దెకు తీసు కున్నారు. అప్పుడు రాత్రి పదిగంటల సమయమైనది శిష్యులతో ఆయన గదులలో ప్రవేశించారు. స్నానాలగదులెక్కడవున్నవో, మరుగుదొడ్లెక్కడ వున్నవో వారికి తెలియలేదు. అంతా చీకటిగా వున్నది. తెల్లవారిన తర్వాత

పరిశీలనగా చూడవచ్చునుకున్నారు. ఒకగదిలో ఆయన విశ్రాంతికొరకు అప్పుసరమయిన ఏర్పాట్లు చేయబడ్డాయి. ఆయనగదికి వంతులవారీ కాపలాగా ప్రథమంగా యీరుచ్ వంతు వచ్చింది.

ఆయన అవసరాలన్నీ చూచుట పూ ర్తికాగానే ఆయనకు విశ్రాంతి కలుగుటకొరకు యీరుచ్ తలుపు వారగావేసి గుమ్మంలో కావలివున్నాడు యీరుచ్ వంతుకాగానే ఆ రాత్రి గుస్తాద్‌జీ వంతు కాపలాపడింది. తిరిగి యీరుచ్‌కి తెల్లవారుఝామున ఆయన నిదురనుండి లేచే సమయానికి వస్తుంది తక్కిన శిష్యులు కాకా, పెండూ, గుస్తాద్‌జీ మరికొందరు ఆయన గదిని అనుకొనివున్న వరండాలో కటికనేలపై పడుకున్నారు. పగలంతా అలసిపోయి వున్నందున కనీసం బూట్లన్నా విప్పకుండా అలాగే మైమరచి నిద్రించారు.

ఆరాత్రి ఈరుచ్ వంతు పూర్తికాగానే తరువాత వంతు గుస్తాద్‌జీది అయినందున మెల్లగా శబ్దం కాకుండా, గుస్తాద్‌జీని లేపి కాపలాకు బాబా గది గుమ్మందగ్గరకు పంపి, తాను ఆ స్థలంలో విశ్రమించాడు. కొద్దిసేపు గడిచిన తరువాత గుస్తాద్‌జీకి మూత్రవిసర్జన చేయవలసి వచ్చింది. ఎటు వెళ్ళాలో తోచలేదు అదంతా కొ్రిత్తప్రదేశం. తను బాబా చెంత వున్నందున అది అతి పవిత్రమగు చోటు అయినది. అక్కడ మూత్రవిసర్జన చేయుట ధర్మ విరుద్ధము కాగలదు.

బాబాకు కావలి వున్నప్పుడు ఎట్టి పరిస్థితులలోను ఆయనను వదలి, అవతలకు పోరాదు. ఈ నియమము బాగా తెలిసినప్పటికీ గుస్తాద్‌జీకి లఘుశంక తీర్చుకొనుటకై తొందరపెట్టుటచేత ఏమిచేయాలో పాలుపో లేదు, చివరికాయన కొక ఆలోచన వచ్చింది. ఒక్క నిముషము పవిత్ర మగు ఆ తావును వీడి, కొంచెం అవతలకు వెళ్ళి తన కోర్కె తీర్చుకో వచ్చునుకున్నాడు. ఆ సమయంలో గది గుమ్మం అనుకుని బారుగావున ఒక సిమెంటు బెంచివంటి కాంక్రీటు పిట్టగోడపై కూర్చుని వున్నాడు. అది తమ మందిరానికి సరిహద్దు గోడగా భావించాడు. అందువలన తను గనుక ఆ

పిట్టగోడ అవతలకు దుమికితే అక్కడ తన శంక తీర్చుకో వచ్చనుకున్నాడు. గోడ అవతలవైపు అందు కనువగుస్థలము కాగలదని, అది ధర్మ విరుద్ధము కానేరదని అనుకున్నాడు.

ఒకవేళ బాబా పిలిస్తే, చప్పట్లు వినపడుతంత దూరంలోనే వుంటానని తలచాడు. ముందుగా బాబా గది తలుపు వద్దకు వెళ్ళి ఆయన గాఢ నిద్రలో వున్నారో మేలుకొని వున్నారో నిర్ధారణ చేసుకొనదలచాడు. గురక వినపడితే ఆయన గాఢ నిద్రలో వున్నట్లని భావించాడు. సాధారణంగా బాబా గురక, మన గురకలావుండదు. చాల బిగ్గరగా గంభీరింపుతో వుండేది. తలుపువద్ద ఒకటికి రెండు సార్లు చెవి వుంచి, ఆయన గురక జాగ్రత్తగా గమనించాడు. మరోసారి విని ఆయ గాఢనిద్రలో వున్నారని నిర్ధారణ చేసుకున్నాడు. ఇప్పుడు ఒకటి, రెండు నిమిషాలు, బాబాను వదలి వెళ్ళినా ఫరవాలేదనుకున్నాడు.

అదీకాక తనెంతో దూరము వెళ్ళుటలేదని కూర్చున్న బెంచీకి అవలవైపుననే దిగుతున్నందున పిలిచినా వినపడగలదని సరిపుచ్చుకున్నాడు అంతకుముందు తాను కూర్చున్న బెంచీపైనుంచి ఒకకాలు క్రిందికిదించి, నేల తగులుతుందేమోనని తడుముకున్నాడు. ఎంతకీ నేల తగలనందున క్రిందికి దుముకుటకు వుపక్రమించి రెండవకాలు కూడ బెంచీ క్రిందకి జాచాడు.

అంతలో ఆయన చప్పటు విడవకుండా వినపడినవి. అలా విడవక శబ్దంచేస్తే దాని అర్థం, కావలివున్నవారు వెంటనే పరుగున బాబా చెంతకు వెళ్ళాలి. లఘుశంక తీర్చుకొనుటకు వుద్యుక్తుడౌతున్న గుస్తాద్‌జీ చప్పట్లు విన్నాడు. మూత్రవిసర్జన కోరిక పూర్తిగా మరచాడు. ఆ ఆలోచన విస్మరించి వెంటనే ఆయనవద్దకు పరుగుపెట్టాడు. గదితలుపు మెల్లగా తెరచి, టార్చి వెలుగులో ఆయన సౌంజ్ఞను గమనిస్తున్నాడు. ఇక్కడ మనమొక విషయం గుర్తించాలి. గుస్తాద్‌జీకూడ ఆయన ఆజ్ఞమేరకు తన జీవితాంతం మౌనాన్ని పాటించాడు.

పిలవగానే రానందుకు ఆయన మందలిస్తున్నారు. "నా పిలుపు ననుసరించి నీవు వెంటనేవచ్చి యుండవలసినది. నేనుచప్పట్లు చరిచినప్పుడు నీవు ఎక్కడ వున్నావు?" అని ప్రశ్నించారు.

అందుకు గుస్తాద్‌జీ బెంచీ అవలకు దిగబోవుచున్నట్లు సౌంజ్ఞ చేశాడు. న్యాయానికి తాను కూర్చున్నచోటునుండి ఆయన పిలవగానే ఆయన గదికి చేరుటకు ఎంతో సమయం పట్టలేదు. "అయినప్పటికీ ఒకటి గుర్తుంచుకో. నీవు కావలికాయుటకు నిర్ణయించబడిన స్థలంలో ఎటూ కదలక కూర్చొని వుండాల్సింది. సరే! యిప్పుడు కదలక, ఎలాంటి శబ్దం రానీయక గుమ్మంలోనే కూర్చో" అని మందలించి పంపారు.

గుస్తాద్‌జీ విధేయతతో తలూపి తన స్థానానికి వెళ్ళి కూర్చున్నాడు. మనందరకూ తెలుసు! సాధారణంగా లఘుశంకకు కోరికకలిగి, కారణాంతరముల వలన ఆ కోరిక తాత్కాలికంగా ఆపుకుంటే తరవాత కడుపుబ్బి ఆ కోరిక ఎంత రేకెత్తిస్తుందో ఊహించుకోవచ్చును. ఇప్పుడు ఆ కోరిక అతనిలో ప్రకోపించింది. కడుపుఉబ్బిపోతున్నది. ఆపుకోలేకపోతున్నాడు.

కదలుటకు వీలులేదు. శబ్దం చేయరాదు. అది బాబా ఆజ్ఞ. ఒకసారి కూర్చున్న చోటునుండి క్రిందా పైనా పరికించి చూశాడు. ప్రథమంలో మూత్రవిసర్జన చేయాలనుకున్నప్పుడు, మబ్బులతో ఆకాశం కప్పబడి చీకటిగావుంది. ఇప్పుడా మబ్బులు వీడి నక్షత్రాలు వెలుగుతున్నాయి. వాటి వెలుతురులో తాను కూర్చున్న బెంచీ వెనుక క్రింద తొంగి చూచాడు. క్రిందకు దూకితే నేల ఎంత క్రింద వున్నదో చూద్దామనుకున్నాడు. ఆ దృశ్యం చూచి బేజారెత్తిపోయాడు.

బెంచీ క్రిందభాగమంతా ఆకాశంలోని నక్షత్రముల ప్రతిబింబాలు ప్రతిఫలిస్తున్నాయి, అది ఒక పెద్ద తటాకం, ఆ పట్టణమంతటికీ మంచి నీరు సరఫరా చేసే చెరువది. దాని అంచుపైన ఆయన కూర్చొనివున్నాడు. సమయానికి బాబా చప్పట్లు కొట్టి పిలవకపోయి వుంటే గుస్తాద్‌జీ బెంచి

పై నుండి దుమికి వుండేవాడు. తిన్నగా ఆ చెరువులో మునిగిపోయేవాడు. నీటిమట్టానికా చెరువు దాదాపు 40 అడుగుల లోతున్నది.

మౌనంతో వున్న గుస్తాద్‌జీ అరకుటకు కూడా వీలులేదు. అత డేమైపోయేవాడో వూహించుకోవచ్చును. మరునాడు గుస్తాద్‌జీ జరిగినదంతా తోటి శిష్యులకు చెప్పి చెరువు గోడ అంచు అందరికీ చూపాడు. జరిగిన సంగతిని బాబాకు సవిస్తరంగా చెప్పాడు. అంతా విని, అసలేమీ జరుగ నట్లు, తనకేమీ తెలియనట్లు కేవలం తలవూపి వూరుకున్నారు. యదార్థానికి ఆయనకు అంతా తెలుసును. విద్రావస్తతో ఆయన శరీరం నిద్రిస్తుంది. ఎరుక చైతన్యంతో మామూలుగానే వుంటుంది. అంటే అనంత జ్ఞానం సర్వజ్ఞత్వం మాత్రం యధాతధంగా కొనసాగుతూనే వుంటుంది.

## అపారకరుణ

"ఈ జీవితం వేరని, ఆధ్యాత్మికత వేరని, అది ఈ భౌతికప్రపంచ ముతో సంబంధం లేనిదని భావించి అట్టి ఆధ్యాత్మికత అన్వేషించుట వృధా ప్రయత్నం" అన్నారు బాబా. మన మతాలు కులాలు ఈ జీవితానికి కొంత రూపాన్ని కలుగచేశాయి. ఆధ్యాత్మిక జీవితము నిజానికొక విస్తృత ప్రాతి పదిక. జీవితమంతా అది ఆక్రమించివున్నది.

కేవలం యీ ప్రపంచాన్ని వదలి, అన్నిటినీ త్యజించి బాహ్య దృష్టిలో సామాన్య జీవితం గడిపినంతమాత్రాన ఆధ్యాత్మికత అనిపించు కోదు. మెహెర్‌బాబా మనలను మనంగానే వుండమన్నారు. ఎప్పుడూ ఎక్కడవున్నామో అక్కడే ఏపని చేయనున్నామో దానినిచేస్తూ వుండమనే వారు. అనగా భగవంతుడయిన బాబా అన్నింట వున్నాడనే భావంతో అలా చేయకలగాలి. దేనిని త్యజించనవసరంలేదు. ఏ ప్రదేశానికి వెళ్ళనవసరం లేదు.

అందుకే చూడండి! బాబా పట్టణాలకు దూరంకాకుండా, మరీ ధుఖ్యా కాకుండా, తన ఆరామక్షేత్రాలను ఎన్నుకున్నారు. సహజపరిస్థితులలో వుంటూ దేనిని త్యజించకుండా గడిపిన తన జీవితం మనకు ఆదర్శప్రాయమైంది.

ఆయన దినచర్యలలో మనకు గోచరమయ్యే బాహ్యచర్యలు-క్షురకర్మ, స్నానపానాదులు, వస్త్రధారణ, మస్తులకాహారము తినిపించుట, స్నానాలగొడ్లు, మరుగుదొడ్లు శుభ్రపరచుట, స్నానానంతరము మండలితో లేదా అంతరంగికులతో ఏకాంతముగా గడుపుట ఇవన్నియు బాబా చేసిన కార్యక్రమాలలోని భాగాలు. ఆ విధంగా ఆయన తనలోని ప్రతి ఔన్స శక్తిని, గ్రామికజీవనం గడుపుతూ వెచ్చించారు.

ఈ విధమైన చర్యతో బాహ్యంగా ఏ విధమైన ప్రాధాన్యత గోచరము కానప్పటికీ, ఆధ్యాత్మికంగా ఎంతో విశిష్టతవున్నది. రాత్రులందు పూతోటలో వెదజల్లే పరిమళం మాదిరి, ఆయన తన చర్యలద్వారా ప్రేరణలేని మానవాత్మలో దైవస్పర్శ ద్వారా ప్రేరణ కలిగించుట ప్రధానధ్యేయం అదే ఆయన మనకందించే ప్రేమ.

ఒక వ్యక్తి నిజంగా ఈ మానవాళిని ప్రేమిస్తే, అప్పుడుమాత్రమే అతడు తన సర్వస్వాన్ని అందరికీ యివ్వ నిచ్చగించును. యదార్ధమయిన ప్రేమ అలవడినప్పుడే జీవితాన్ని త్యాగంచేయగలుగును. తలిదండ్రులు, భార్యాబిడ్డల యెడల యదార్ధ ప్రేమ చూపినప్పుడే వారికి అవుసరమగు సకల సదుపాయములు భగవంతుడు సమకూర్చగలడు.

భగవంతుడు మానవ రూపంలో అవతరించి చేసే కార్యక్రమమిదే. అవతారుడుగా మనమధ్యకు వచ్చి, ప్రేమ సత్యాన్ని ఎరుకరపరచి మేల్కొల్పును భగవంతుడంటే సత్యం. మనకు గోచరించే యీ సకల సృష్టి మాయ. సత్యం, మాయలో అవతరించినప్పుడు, ఆ సత్యాన్ని అవతారుడు అంటున్నాం.

ఈ సత్యం వేరు మాయ వేరు. ఇవి రెండూ కలిసి వుండవు. సాక్షాత్తు భగవంతుడు సత్యమయినప్పటికీ ఆయన తన సృష్టియెడల తన కున్న అపార కరుణ దయ, ప్రేమ, వాత్సల్యం వీటిని పురస్కరించుకొని స్వయంగా శరీరధారణ చేయును. ఇట్టి శరీరధారియైన దైవీ మానవుడు అంత శక్తి జ్ఞానానందములు కలిగివుండీ, ఈ మాయను చెల్లాచెదరు చేయ గల సమర్థుడైయున్నప్పటికీ అలా చేయడు. మాయ యొక్క సహజత్వము మనల కవగతమగు నట్లు మేల్కొలుపును. ఒకవేళ ఆయన మాయను చెదరగొట్టినచో అది అంతటితో పూర్తియగును. అందుకే ఆయన దానిని కోరుకొనరు.

మాయనుండి మనల నెటుల మేల్కొలుపుదురు? తన సత్యము యొక్క వెలుతురు, మాయయందు ప్రసరించుటకు వీలులేనట్లుగా వస్త్ర ధారణ చేయును. అయినప్పటికీ సత్యము యొక్క వెచ్చదనం బహిర్గత పడుతుంది. అందువలన ఆయన అవతరణలో ఆ వెచ్చదనం వుంటుంది. అలాంటిది వున్నదనే భావం మనలో అవగాహన అవుతుంది. అవతారుడు మన మధ్యకు వచ్చి చేసే పని మాయను కొనసాగుటకు అనుమతించుట. అది మాయ అనే భావం మనలో కలిగించుట ఆదొక మేలుకొలుపై మనలో ప్రేరణ కలుగుతుంది.

ఈ సందేశం మనకు సులభంగా అర్థమగుటకు ఈరుచ్ ఒకచక్కటి సన్నివేశం తెలిపాడు.

అక్బరు భారతదేశపు మొగలాయి చక్రవర్తులలో ప్రసిద్ధి చెందిన వాడు. అతడు దైవభక్తిపరుడు. అధ్యాత్మికంగా అతడు గొప్ప వేదాంతి భగవంతునియందు ప్రేమ, దైవంతోవుండే సంబంధం ఆయన సృష్టి విధానం వీటియందు అతనికి ఎక్కువ అభిలాషవుండేది. తీరిక సమయాల్లో వేదాంత చర్చలు చేస్తూ వుండేవారు.

ఆయన అస్థానంలో బీర్బల్ అనే అమాత్యుడొకరు వుండేవారు. అతడు హిందువు. వినోదంతోపాటు విజ్ఞానంతోకూడిన ఆధ్యాత్మిక బోధ

లెన్నో చక్రవర్తికి వినిపిస్తూ వుండేవాడు. అక్బరు తనకు అభిలాషవున్న అనేక విషయాలపై బీర్బల్‌తో చర్చిస్తూ వుండేవాడు.

ఒకరోజు, "భగవంతుడు సర్వశక్తిమయుడు. ఒకే భగవంతుడు వేర్వేరు నామాలతో యుగయుగాలుగా అవతరిస్తున్నాడు" అనే విషయముపై చర్చ కొనసాగుతున్నది. మధ్యలో చక్రవర్తి జోక్యం చేసుకొని అమాత్యుని యీ విధంగా ప్రశ్నించాడు

"నీవు మీ భగవంతుడు అందరికంటే 'శక్తిమంతుడు అంటావు?" అన్నాడు చక్రవర్తి

"అవునండీ! అయితే మీ భగవంతుడు, మా భగవంతుడూ ఒక్కరే! వారిలో భేదమేమీలేదు. ఉన్నది ఒకే భగవంతుడు" అని బీర్బల్ సమాధానమిచ్చాడు.

"అవునవును నీవు మీ దేముడు, మా దేముడు ఒక్కడే అంటావని నాకు తెలుసును. కానీ బాగా గుర్తుంచుకో. మాకు మాత్రం మా అల్లా ఒక్కరే దేముడు. మా దేముడెంతటి శక్తివంతుడో తెలుసునా? ఆయన మీ దేముడులా మాటిమాటికీ యీ భూమిమీద అవతరించి, తన బిడ్డలకు రక్షణ కలిగించుటో, మేల్కొలుపుటయో చేయడు."

"మా దేముడు ఎంతటి శక్తిమంతుడంటే, ఆయన ఎక్కడ వున్నప్పటికీ, తన శక్తి ఎంతో గొప్పది కనుక, తన బిడ్డల కోర్కెలు తీర్చ కలుగుతున్నాడు. కేవలం ఆయన కృప వుంటే చాలును. తానీభువిపై అవతరించకుండానే సకల సృష్టిని నడుపగలుగుచున్నాడు."

"మరి మీ దేముడో? యీ సృష్టిని మేల్కొలుపుటకు తగు సహాయమందించుటకు భూమిపై అవతరించవలసి యున్నది. దీనినిబట్టి మా అల్లాకంటే, మీ దేముడు తక్కువ శక్తి కలవాడంటావా? కాదా?" అని ప్రశ్నించాడు చక్రవర్తి.

"ఓహొ! లేదు ప్రభూ! మీరీవిషయంలో పొరపడుతున్నారు" అన్నాడు మంత్రి. "మా దేముడీ భూమిపై ఎన్నడూ అవతరించడు. ఎందువలన? మరి నీవు చెప్పినట్లు ఆయనకూడ అదే దైవమైనప్పుడు, ఆయన యీ పుడమిపై ఏల అవతరించవలసి వస్తున్నది?" అని ప్రశ్నించాడు.

"ప్రభూ! మీ ప్రశ్నకు తగు సమాధానం చెప్పాలంటే నాకు కొంత సమయం కావాలి. కొంతకాలం పాటు నన్ని సభకు దూరంగా వుండ నీయండి." అని వేడుకున్నాడు మంత్రి.

"సరే!" అన్నాడు చక్రవర్తి. "నీకు కావలసినంత వ్యవధి తీసుకో. మీ దేముడు, మా దేముడు గురించి మాత్రము నాకు గట్టి రుజువుతో విశదీకరించాలి." అని షరతు విధించాడు.

బీర్బల్ రాజుగారి దగ్గర శలవు తీసుకున్నాడు. కొద్దిరోజులు గడిచిన తరువాత తిరిగి ఆస్థానానికి వచ్చాడు. చక్రవర్తి బీర్బల్‌ని చూడగానే ఆనందపడ్డాడు. "నా ప్రశ్నకు రుజువు చూపెదవా?" అని అడిగాడు. అంత బీర్బల్ చక్రవర్తితో రుజువుకు సిద్ధమేనంటూ, ముందుగా తనను, తన కొలువులోని ఉద్యోగులందరితో, ఒకరోజు శలవుదినంగా, సరదాగా గడుపుటకు నదిలో బోటు షికారు చేయుటకు తీసుకెళ్ళమని అర్థించాడు.

అక్బర్‌కు బీర్బల్‌పై అపారగౌరవం వుండేది. అతనిని చూడనిదే వుండలేకపోయేవాడు అట్టివాడు చాలరోజులు ఎడబాటుతో తన అమాత్యుని తిరిగి కలసికొనిన ఆనందంలో వున్నాడు. అందువలన ఆయన వెంటనే మంత్రిగారి కోరిక మన్నించాడు. ఒండొరుల సమక్షంలో ఆనందంగా, విరామదినం గడుపుటకు అంగీకరించాడు. బోటుషికారు కవసరమగు ఏర్పాట్లన్నీ బీర్బల్ స్వయంగా పర్యవేక్షించాడు. సేనాపతులు, మంత్రి సామంతాదులు, రాజోద్యోగులు అందరికి పడవలు సిద్ధం చేయబడినవి. చక్రవర్తిగారి కుమారునికి వేరే ప్రత్యేకపడవ ఏర్పాటు చేయబడినది.

ఈ విధంగా రాజుగారి బృందం పడవలపై బయలుదేరింది.

ప్రయాణం ఎంతో ఆహ్లాదంగా వుంది. అంతలో హఠాత్తుగా పడవలలో కలకలం బయలుదేరింది. "రాజుగారబ్బాయి నదిలో పడిపోయారు" అంటూ కేకలు వినబడుతున్నాయి.

కేకలు విన్న చక్రవర్తి గభాలునలేచాడు. తన దుస్తులు వూడదీయబోయాడు. చెంతనేవున్న బీర్బల్ "ప్రభూ! మీరేల హడావిడిపడెదరు? ఇక్కడ యింతమంది వున్నారుకదా? అటుచూడండి! ఎందరు నీటిలో దూకుతున్నారో? నీటిలో మునిగిన రాకుమారుని వారు రక్షించగలరు" అన్నాడు.

"అమాత్యా! నన్ను ఒంటరిగా వదలండి. రాకుమారుడు మునిగిపోతాడు. తప్పుకొనుడు నన్నాపకుడు. నా కుమారుని రక్షించుకొనుటకు నేను స్వయంగా వెళ్ళాలి" అంటూ అక్బరు నదిలో దూకేశాడు.

ఆ వెంటనే మంత్రికూడ రాజువెనకనే దూకాడు నీటిలో యీదుతూ యిరువురూ కొంతసేపు వెతికారు. చివరకెలాగైతేనేమి, మంత్రి రాజును ఒడ్డుకులాగాడు. ఒడ్డెక్కిన రాజుకు మతిచలించింది "నా యువరాజెక్కడ?" అంటూ అరవసాగాడు.

అంతట మెల్లగా మంత్రి చక్రవర్తిని సముదాయిస్తూ "క్షమించండి ప్రభూ! అదుర్దాపడవద్దు. అసలు యువరాజు మనవెంటరాలేదు" అన్నాడు.

"ఏమిటి బీర్బల్, నీవనేది? నేవింతకుముందా పడవలో యువరాజుని చూచితిని గదా! అయితే అతనెక్కడ వున్నాడు?"

"అయ్యా! అసలు యువరాజు యిక్కడ లేనేలేడు మీరు చూచినది లక్కతో చేసిన యువరాజు విగ్రహం. మీరు నన్నొక ప్రశ్న వేసి రుజువు చేయమన్నారు. అందుకే క్రియారూపంలో మీకు చెప్పుటకు నేను పన్నిన పన్నాగం" అన్నాడు.

"అంటే నీ వుద్దేశ్యమేమిటి? యీ చర్యలో నా ప్రశ్నకు జవాబెక్కడ వున్నది?" అని అడిగాడు చక్రవర్తి.

"లేకేమి ప్రభూ! మీరు మహా చక్రవర్తులు గదా! మీ నుండి ఒక్క మాట వెలువడినంత మాత్రంతో, మీ కనుసౌజ్ఞలతో, తమ కుమారుని రక్షించుటకు లక్షలాదిమంది నదిలో దూకుటకు సిద్ధముగా వున్నారు. అందుకు మీరు తృప్తిచెందలేదు. నేనెంత చెప్పినా మీరు వినిపించుకోలేదు. స్వయంగా నదిలో దూకి మీరే మీ కుమారుని రక్షించుకోదలచారు. మీ కుమారుని రక్షించుటకు, వెదకి పట్టుకొనుటకు. ఒడ్డు చేర్చుటకు, మీరే స్వయంగా నీటిలో దూకిన కానీ మీకు తృప్తి కలుగలేదు."

"అలాగే భగవంతుడుకూడ, తనచే సృష్టించబడిన చరాచర జగత్తు అంతటినీ రక్షిస్తాడు. తన అపారదయను సృష్టిలోని బిడ్డలయందు ప్రసరింపచేసి వారికి తన ప్రేమనందించుటకు, మాటిమాటికి మానవరూపంలో అవతరించుచుండును. అందుకే హిందువులు భగవంతుని అవతారంపై అమిత విశ్వాసం వుంచెదరు,

మీ కుమారునియందు మీకున్న ప్రేమ, కష్టములోవున్న అతనిని ఆదుకొనుటకు మిమ్ములనెట్లు వుద్యుక్తులనుచేసిందో, అట్లే సృష్టికారకుడైన భగవంతుడు, సృష్టియెడల తనకున్న అపారకరుణవలన సృష్టి రక్షణకొరకు శరీరధారియై అవతరించును. సృష్టియందు తనకున్న ప్రేమయే ఆ భగవంతుని అవతరింపచేయుచున్నది" అని బీర్బల్ విశదీకరించాడు.

## గురువాజ్ఞ

మనం బాబాను ఎంతగాఢంగా ప్రేమిస్తే ఆయన మనకు అంత సన్నిహితంగా వుంటారు మనబాధలు తన బాధలుగా స్వీకరిస్తారు. మనం నవ్వుతూ వుంటే, ఆయన నవ్వుతూవుంటారు. మనం విచారంలోవుంటే ఆయన విచారిస్తూవుంటారు. మనం బాధపడుతూ వుంటే ఆయన బాధననుభవిస్తూనే వుంటారు. మనం దుఃఖిస్తే ఆయనకూడా దుఃఖాన్ని అనుభవిస్తారు. మనం ఏంచేస్తే ఆయన అదే చేస్తారు.

కనుక మనం నిజంగా బాబాను ప్రేమించడం అంటే, ఆయనను బాధలనుభవించకుండా, వుంచకలుగుట అన్నమాట. మనం ఎట్టి వ్యథలనుభ వించకుండా, వుంచకలుగుట అన్నమాట మనం ఎట్టి వ్యథలనుభవించ వలసి వచ్చినా, అవి భగవంతుని నుండి యివ్వబడిన బహుమానములుగా స్వీకరించి, నిత్యం సంతోషంతో వుంటూ, నిత్యము తృప్తితో వుండకలిగి నప్పుడు. మనం బాబాను యథార్థంగా ప్రేమించినవారమవుచున్నాము. అప్పుడే మన మాయనకు ఏవిధమైన భారంకాకుండా వుండగలం. యథార్థ బాబా ప్రేమికుల బాధ్యత యిది.

అందుకే బాబా పదేపదే చెప్పేవారు. "విచారించకుడు. సుఖంగా వుండుడు" "నన్ను ప్రేమించుము. నేను నీ అవుసరములు చూచుకుంటాను నన్నేమీ కోరకుము" అనేవారు.

బాబాతో సాహచర్యం చేసి, సర్వము పరిత్యజించి, బాబాకు అర్పణ గావించుకున్న సన్నిహిత శిష్యులే, బాబా ప్రేమలో మునిగిపోయినా ఒక్కొక్కప్పుడు, తప్పటడుగు వేస్తూ వుండేవారు. ఆయనయిచ్చే ఆజ్ఞలు బాహ్యంగా అర్థమగు రీతిలో వుండేవికావు. ఆయన ఆజ్ఞలను మన భాషలో తెలివితేటలతో అన్వయించుకొని తప్పటడుగులు వేస్తూ వుంటాము.

నవజీవనకాలంలో ఒకసారి, ఆయన తన బృందంతో అలహాబాదు వైపు పర్యటిస్తున్నారు. ఆ రోజులలో ఉత్తరభారతంలో గజగజవణికించే చలిగాడ్పులు వీస్తున్నసమయం. శిష్యులంతా ఆరుబయట అంత చలిలోనూ నిర్భీకంగా గడుపుతున్నారు. ఆరోజు వారంతా ఒక ఏకాంతప్రదేశములో బసచేశారు. తెల్లవారుఝామున నాలుగుగంటల సమయంలో హఠాత్తుగా బాబా శిష్యులందరినీ లేపి, తమతమ పక్కలమీద కూర్చోమన్నారు. మాట్లాడకుండా ఏమీచేయకుండా కదలకుండా కూర్చోమని, మళ్ళీ అయిదు గంటలు కాగానే పడుకోమన్నారు.

బాహ్యంగా చూచుటకీ ఆజ్ఞ అర్థరహితంగా కనపడుతుంది. అందలి అంతరార్థం దానిపర్యవసానం ఆయన ఎందుకలా చేయించారో మనము

వూహించుకోవాలసిందేకానీ, విశదపడదు. యధార్ధ శిష్యుడుగా గురువు యిచ్చే ప్రతిఆజ్ఞ స్వంత ఆలోచనలతో అన్వయించుకొనకుండా పాటించి తీరాలి. అది క్రమశిక్షణ.

ఇట్టి ఆజ్ఞలను పాటించు సమయంలో వుండే క్రమశిక్షణనే డాక్టర్ ఘనీ "కంతాలయోగం"అని హాస్యంచేసేవాడు. "కంతాల" అంటే బోరు కొట్టుట, విసుగుచెందుట అన్నమాట.

ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిన విశేషమొకటున్నది. ఒక సద్గురువుయిచ్చే అనూహ్యామగు ఆజ్ఞలను విధేయతతో పాటించి భరించ గలిగినవారు ఆధ్యాత్మిక క్రమశిక్షణలో అత్యున్నతస్థానమున్నట్లు పరిగణింప బడుదురు.

విడువకుండా దైవాన్ని జ్ఞాపకం పెట్టుకొని, విడువకుండా భగవం తునిలో లీనమగునంతటి సహజ ధ్యానం అలవరచుకున్నప్పుడు, అట్టివారు జీవిత గమ్యమగు సహజ సమాధి స్థితికి చేరగలరు. ఇట్టి సహజ ధ్యానం అలవాటు కావాలంటే, అవతారుని సాంగత్యంలో ఆయన యిచ్చే ప్రతి ఆజ్ఞను విధేయతతో పాటించితీరాలి.

ఆయన యిచ్చే ఏదేని ఆజ్ఞలో యిమిడివున్న అర్థాన్ని తెలుసుకొను టకు ప్రయత్నిస్తే అది మనకు అవగతం కాకపోగా, గురువాజ్ఞను ధిక్క రించినట్లే అగును. నిజానికి అట్టి ఆజ్ఞలో విధేయతా విలువతోపాటు, ఆధ్యా త్మిక దృష్టిలోకూడ, ఒక ప్రత్యేకత సంతరించుకొని వుంటుంది. దానిని శిష్యుడు పాటించనప్పుడు, గురువుగా అవతారుడు పొందేవ్యధ అనూహ్యం

బాబాయిచ్చే ఆజ్ఞలను పాటించనప్పుడు పొందే ఫలితం మనకీ సంఘటనలో చక్కగా అవగతమవుతుంది. అది 1949 నవంబరు 22న జరిగింది. ఆనాడు బాబా శిష్యులతో బెనారస్‌లోని నాతి ఇన్లి బంగళాలో నవజీవనం గడుపుతున్నారు.

ఒక రాత్రి పరుండబోవు సమయంలో నవజీవనం గురించి తోటి

మిత్రుల మధ్య సంభాషణ జరుగుతోంది. బాబా వేరేగదిలో విశ్రాంతి తీసుకుంటున్నారు. సంభాషణ వ్యాఖ్యాన పూర్వకంగా సాగుతోంది. మధ్యలో దా" ఘనీ జోక్యం చేసుకొని తన సహజ హాస్య చతురోక్తితో "ఓస్! నవజీవనమంటే యింతేకదా! సమయం కాని సమయంలో చేయవలసిన నిత్యకృత్యములు చేయుట ప్రతిబంధకములేని లేవికోట. కష్టములను కొనితెచ్చుకొనట, సాఫీగా సాగిపోయే సన్నివేశంలో హఠాత్తుగా కుదుపు కల్పించుట, యిలాంటివన్నీ కలిపి అనుభవించే జీవితమే నవజీవనం." అన్నాడు.

ప్రక్కగదిలోనే వున్న బాబా యీ వ్యాఖ్యానాన్ని విన్నారు. విని, ఘనీకి కబురంపి తానుచేసిన వ్యాఖ్యానాన్ని సవివరంగా వివరించమని అడిగారు. నైరాశ్యంతోవున్న ఘనీ ఎంతో ధైర్యంగా వివరిస్తున్నాడు.

"చూడు బాబా! ఈ భూప్రపంచంలో ఎక్కడాలేని విధంగా మేము రోజూ చీకటితోలేచి తేనీటిసేవనం చేయాలి. ఉదయం అయిదుగంటలకు టీ త్రాగాలంటే నాలుగుగంటలకే లేచి కాలకృత్యాలు తీర్చుకొని తయారు కావాలికదా! కేవలం తేనీటి కోసరంతప్ప అంత చీకట్లోలేచి మేమేమీ మతపరమైన ధర్మాలను ఆచరించవలెలేదు, ఒకహారతిలేదు, సంధ్యలేదు, పూజలేదు, నమాజులేదు, ప్రార్ధనలన్నాలేవు మేముమాత్రం కొరుక్కుతినే ఈ చలిలో అంతచీకటిలో లేవాలి. వణుకుతుంటూ, ముక్కుకుంటూ, మూలుక్కుంటూ, గొణుగులతో, చలిలో బాధపడుతూ దగ్గుకుంటూ తెల్లవారుఝామున 4-30 లకే కేవలం ఓ కప్పు టీ త్రాగి ఆనందించుటకు లేకపోతే ఓముక్క చపాతీ నీవుపెడితే అయిదుగంటలకల్లా తిని ఆనందించుటకని మేము నానా అవస్థపడాల్సి వున్నదికదా! అన్నాడు."

ఘనీ యీమాదిరిగా వ్యాఖ్యానిస్తున్నప్పుడు ప్రక్కనేవున్న తోటి శిష్యులు ఒక్కసారిగా గొల్లున నవ్వారు. బాబా కూడ పైకి అందరిలోపాటు ఆ సమయంలో ఆనందంగా వున్నట్లు కనపడ్డారు. మామూలుప్రకారం ఆరాత్రి పరుండబోవు సమయంలో అందరికీ వీడ్కోలు చెపుతూ బైదులును

పిలిచి, రేపు ఉదయం టీ మామూలుకంటే 15 నిముషములు ముందుగా అంటే 4-45 ని॥లకే అందరికీ యివ్వమని వూహించని విధంగా ఆజ్ఞ లిచ్చారు.

23వ తేదీ ఉదయం మిత్రులతో సమావేశమై అందరూ ఆశ్చర్య పోతూ వుండగా గతరాత్రి ఘనీ చేసిన వ్యాఖ్యను గురించి చెపుతూ "ఆ వ్యాఖ్య ననుసరించే యీ ఉదయం మామూలుకు భిన్నంగా 15 నిమిషాలు ముందుగానే మీ చేత టీ త్రాగించాను. గత రాత్రంతా నాకు నిద్దురలేదు. అందునా ఘనీ వ్యాఖ్య విన్నవారంతా విరగబడి నవ్వినందున ఆ చర్య నన్ను ఆలోచనలో ముంచింది."

"నాకేమనిపించిందంటే, టీ సరఫరా చేసే సమయం గురించి ఘనీ వ్యాఖ్యానించిన తీరును మిత్రులంతా ఒక్కుమ్మడిగా విరగబడి నవ్వి నందున వారంతా అతని వ్యాఖ్యానాన్ని బలపరచినారనిపించింది, మీరంతా దానిని హాస్యంగా తీసుకున్నారో యధార్థంగా తీసుకున్నారో ఎలాగయినా అనుకోవచ్చును."

"అదంతా హాస్యానికయితే నేను మీతో హాస్యంగా భావించకపోయి నందుకు నాది తప్పు కావచ్చును. మరి అది తీవ్రమైనదిగా పరిగణించబడి నప్పుడు అంటే, మీరంతా వుదయాన్నే టీ త్రాగాలనే ఆజ్ఞ అనవసరమని, ఒక అర్థంలేనిదని అనుకుంటే, అప్పుడు అది విమర్శించుటే కాక, యీ నవ జీవన నియమములలో అత్యంత ప్రధాన నియమోల్లంఘన కాగలదు" అన్నారు.

డాక్టరు ఘనీ యొక్క విమర్శను మిత్రులంతా సమర్థించినట్లు ప్రవర్తించినందువలన బాబాకు ఆ రాత్రంతా నిద్రలేకుండా పోయింది. అందుచేతనే బాబా మరునాటి ఉదయం మిత్రులందరికీ వారిభావాలు విడ మర్చి చెప్పే అవకాశం యిచ్చి అందుకు మిత్రులంతా ముక్తకంఠంతో, బాబా ఆజ్ఞలు, సర్వీలు అంత తేలికగా, అర్థంచేసుకొనే వీలు అవకాశం

లేకున్నప్పటికీ ఇటువంటి ఆజ్ఞలు అర్థంలేనివని అనవసరమని తలచుట అవివేకము, నిరర్థకమని పలికారు.

ఇలాంటి హామీ మిత్రులనుండి రాగానే, ఆ సమయంలో ఏర్పడిన తీవ్రతను సర్దుబాటుచేసింది. బాబా గతరాత్రి జరిగిన కథ అంతా హాస్యం క్రింద కొట్టిపారవేశారు. దీనికంతటికీ ఘనీ హాస్యధోరణి హేతువైనది. ప్రియతముని వ్యథకు కారణమైంది.

అనాటి ఘనీ వ్యాఖ్యలను అనుమానించి తనయెడల మిత్రులకున్న విధేయతను సంశయించినందుకు బాబా తనకుతానే శిక్ష విధించుకున్నారు. కొందరు శిష్యులను పిలిచి, ఒక్కొక్కరిచేత తన రెండుచెవులు గట్టిగా పిండించుకొన్నారు.

అప్పుడు చెప్పారు "గతరాత్రంతా నేనెంత వ్యథననుభవించానో మీకు తెలియదు రాత్రంతా నాకు నిద్దురరాలేదు. యిప్పుడు మీరిచ్చిన వివరణ విన్నప్పుడు నాకుకలిగిన ఆనందంతో సమానమైన విలువ రాత్రంతా నిద్రలేకున్న ఫలితంతో సమానమైనది. నిద్రలేని ఒకరాత్రిపడిన వ్యథ మీరిచ్చిన వివరణతో కలిగిన ఆనందంతో సమానమైనది అన్నారు.

## సుగుప్తినం

అదేదో ఈ భౌతికప్రపంచంతో సంబంధం లేనిదనే భావనతో ఆధ్యాత్మికతను జీవితానికి భిన్నంగా తలచి దానికొరకు అన్వేషించుట వృథా ప్రయత్నమే కాగలదు. మనం బాహ్యంగా సగటుమనిషి అన్నీవున్నట్లు కనపడతాడు బాహ్యంగా గోచరించే అతడి స్థితియథార్థంకాదు. అతడు తన అభీష్టం సిద్ధించినప్పుడు అసంతృప్తితో వ్యథపడతాడు ఫలితంగా నిరాశ నిస్పృహలు జనిస్తాయి. కోటానుకోట్ల కోర్కెలతో సతమతమైపోతాడు. ఎన్నోకష్టాల నెదుర్కొంటాడు.

ఆత్మ కోరికలు త్యజించి సంపూర్ణ స్వేచ్ఛ పొందినప్పుడే శాశ్వతానంద అనుభూతి పొందగలదు. అటి నుభూతి పొందాలంటే నిశ్చల మనస్సు, ఏకాగ్రత అవసరం. తానాచరించు ప్రతిపనిలోనూ మానవుడు నిర్మలమనస్సుతో ఏకాగ్రత అలవర్చుకుంటే అప్పుడు తన మనస్సు కేవలం ఆచరించు పనిలోనే నిమగ్నమై తక్కిన వ్యాపకాలపై మరుపుతనం కలుగుతుంది. ఆలోచనలన్నీ ఒకే విషయంపై కేంద్రీకరించబడును.

ఉదాహరణకు చిత్రలేఖనం వున్నది అది ఒకకళ. చిత్రాన్నొకదానిని చిత్రించునప్పుడు, చిత్రకారుడు తన వూహల్ని సంపూర్ణంగా ఆ చిత్రాన్ని తయారుచేయుటలోనే కేంద్రీకరిస్తాడు. తక్కిన సర్వస్వాన్ని మరచి పోతాడు చిత్రలేఖనంలోనే సంపూర్ణంగా లీనమైనప్పుడే అతడు అందులో లగ్నం కాగలుగుతాడు. ఈ సందర్భంలోనే బాబా వివరిస్తూ "చిత్రకారుడు తన చిత్రలేఖనంలో తనకుతాను అలా పోగొట్టుకొన్నప్పుడు అతని అహం పోయి ప్రేమ కనబడుతుంది" అన్నారు. అలా ప్రేమానుభవం గలిగినప్పుడు భగవంతుడు సాక్షాత్కరింపబడుచున్నాడు.

అలా తానాచరించు పనిలో నిమగ్నమై సర్వస్వాన్ని మరచి అందులోనే లీనమైపోవుటను యథార్థ మరపుతనం అంటారు. ఆ క్షణంలో భౌతిక పరిసరాలనుండి మానసిక యెడబాటు కలిగించి, దృష్టి నంతటిని ఒకే ధ్యాసపై కేంద్రీకరించుకొనును. కవి తన ఆలోచనలను పరుగెత్తించునపుడు, కళాకారుడు తన చిత్రానికి రూపకల్పన చేయునపుడు, శిల్పి తన శిల్ప చాతుర్యము చాటునప్పుడు, తమ పరిసరాల మరపుతనం ద్యోతకమవుతుంది తాము చేయు పనిలోనే వారు పూర్తిగా మునిగిపోయి చక్కని కళాఖండాల్ని తయారు చేయకలుగుతారు.

మానవుడు తన జీవితంలోని ఒడిదుడు లన్నీ లెక్కచేయక, కేవలం తన వ్యక్తిగత పరిస్థితులను దృష్టిలోనికి తీసుకొనక, సమభావంతో సమస్యలు క్రోడీకరించినప్పుడు ఆధ్యాత్మిక సామ్రాజ్యంలో ప్రవేశార్హత పొందకలుగుచున్నాడు. అప్పుడే యథార్థ మరుపుతనం పొందకలుగు

చున్నాడు. భౌతిక ప్రపంచాన్ని మరపించే మరుపుతనం, మానవుని యాత్రికునిగా మారుస్తుంది. ఈ మరుపే తన ఆత్మను మరచునట్లు చేస్తుంది శారదకు మరపుతనాన్ని మరచి పరిపూర్ణత్వ అనుభవం పొంద కలుగుచున్నాడు.

అకుంఠిత దీక్షతో మనస్సు లగ్నంచేసి అలవరచుకొనే ఏకాగ్రతలో అద్వితీయ ప్రేమ కనబడుతుంది యిది భగవంతుని అంతటి స్వచ్ఛమైనది. అది యిచ్చునే కాని దేనినీ ఆడుగదు అట్టి ప్రేమయొక్క అనుభవం కలిగి నప్పుడు భగవంతుడు సాక్షాత్కరింపబడుచున్నాడు. భగవంతునియొక్క కృప అట్టి ప్రేమ యందు ప్రస్ఫుటము కాగలదు.

ఘనమగు యింతటి ప్రేమకు తార్కాణంగా ఒక చక్కటి కళాత్మక సృష్టిని గురించి వివరిస్తాను.

బాబా ఒకసారి శిష్యులతో మహాబలేశ్వరం వెళ్ళారు శిష్యులతో అక్కడ గడ్డితో ఒకచిన్న పర్ణశాల తయారుచేయించి, అందులో బాబా ఏకాంతంగా వుండేవారు. మరి అందులో ఏమిచేసేవారో ఎవరికీ తెలియదు. తాను విశ్వకార్యక్రమ నిర్వహణలో మధ్యలోవున్నానని, అందువలన ఎవ్వరినీ లోనికి అనుమతించనని మాత్రం చెప్పారు. ఒక్క ఈరుచ్ మాత్రం బాబా ఆజ్ఞలమేరకు, అవసర సదుపాయాలు సమకూరుస్తూ ఆయనకు సేవచేస్తున్నాడు. ఒకరోజున ఈరుచ్‌తో "ఏదన్నా ఒకమంచి కథ చెప్పు" అన్నారు. వెంటనే ఈరుచ్ మదిలో కళద్వారా ప్రేమ సాధనకు సంబంధించిన తాజ్‌మహల్ కథ మెదలినది. అప్పుడు ఈరుచ్ బాబాకు చెప్పిన కథే ఈనాటి తాజ్‌మహల్ వెనుకవున్న అంతరంగిక గాథ

మీరు షాజహాన్ చక్రవర్తి పేరు వినేవుంటారు. ఆయన భార్య ముంతాజ్‌బేగం. ఇద్దరికీ కళలంటే మహాయిష్టం. అందుకే వారు కళా పోషకులైనారు. కళాకారులను గౌరవించేవారు. దేశదేశాలనుండి శిల్పులను, చిత్రకారులను ఆహ్వానించి తగువిధంగా సత్కరించి పంపేవారు. ఒక

రోజున ఇరాన్ దేశమునుండి ఒక కళాకారుడు మన భారతదేశం వచ్చాడు. అతడి స్వగ్రామం ఇరాన్ దేశంలోని "షిరాజ్" అనే పట్టణం. అతడు "షిరాజ్" నుంచి వచ్చాడుగనుక తనపేరు "షిరాజీ" అని చెప్పాడు. ఇతడొక అద్భుతశిల్పి అతని శిల్పకళను షాజహాన్ ప్రభువుముందు ప్రదర్శించి మన్ననలు పొందాలని ఢిల్లీ చేరాడు.

రాజ ప్రసాదం లోనికివెళ్ళుట అంత తేలికైన పని కాదుకదా! అందువలన షిరాజీ, ఆస్థాన ఉద్యోగులను కొందరిని కలసి, తనకు వచ్చిన కళను గురించిచెప్పి, చక్రవర్తి షాజహానుకు కళలయందెంతో అభిరుచి వున్నదని వినియున్నందున, ఆయన దర్శనము యిప్పించమని చెప్పుకున్నాడు.

చివరకు ఎలాగో శిల్పి షిరాజీయొక్క ఆగమనవార్త ఢిల్లీ పాదుషా చెవినిపడి, షిరాజీని తన రాజభవనానికి ఆహ్వానించాడు.

అంత షిరాజీ చక్రవర్తిని రాజసభలో కలిసాడు. "నీవు ఇరాన్ నుండి వచ్చిన మహాశిల్పివని విన్నాను. నేను విన్నదంతా నిజమేనా? నీవు గొప్ప శిల్పివేనా?" అని రాజు షిరాజీని ప్రశ్నించాడు. అందుకు షిరాజీ చిత్తంప్రభూ! నా చేతలగురించి మీరు విన్నదంతా నిజమే. అయితే నాగురించి మాత్రం నాకేమితెలియద"ని జవాబిచ్చాడు. "అయితే నీ శిల్ప చాతుర్యం గురించి చూడాలని అభిలాషగా వున్నది. అది మాకు అవగాహన అగునట్లు చూపగలవా?" అన్నాడు రాజు.

"ఆహా! మహాప్రసాదం యిది నా అదృష్టం తప్పక చూపెదను. కానీ ఒక చిన్నషరతు" అన్నాడు షిరాజీ

"ఏమిటా షరతు?" రాజుగారి ప్రశ్న.

"ఏంలేదు ప్రభూ! మీరుగనుక ఒకచక్కని సౌందర్యవతి యొక్క చేయి మాత్రం నాకు చూపినచో, ఆమె ముఖవర్చస్సు, రూపలావణ్య

రేఖలు యివన్నీ ఏమీ చూడకుండానే ఆ అతివయొక్క సహజరూపాన్ని పాలరాతిపై మలచగలను. ప్రభూ! ఇది నేను మీముందు చేసి చూపదలచు కున్న నా శిల్పచాతుర్యం" అని బదులుచెప్పాడు శిల్పి

"ఏమిటీ! నీవు అలా మనిషిని చూడకుండానే మలచగలవా? ఇది నిజమా?" అంటూ సంభ్రమాశ్చర్యాలతో అన్నాడు రాజు.

"తప్పక చేయగలను రాజా! అది నాకళ కళారాధన నా ధ్యేయం" అన్నాడు శిల్పి. రాజు ప్రక్కనేవున్న రాణి ముంతాజ్ యీ సంభాషణ అంతా విన్నది. విని ఆమెలో కుతూహలం పెరిగి, ఆశిల్పియొక్క కోరికను మన్నించమని చక్రవర్తిని ప్రోద్భలం చేసింది. మళ్ళీ చక్రవర్తి శిల్పిని సంభ్రమాశ్చర్యాలతో "ఏమిటి? నీవు నిజంగా అలా చేయగలవా?" అని అడిగాడు.

"మీరు గనుక నా కోరికను అంగీకరిస్తే తప్పక చేయగలను."

"ఏమిటా కోరిక?" అన్నాడు రాజు?

అలా నేను శిల్పం తయారుచేయవలసిన ఆ అతివయొక్క హస్తమును ఎన్నుకొనుటకు మీరు చాలాచేతులను చూపించాలి. అన్ని చేతులలో నేను ఏదో ఒక చేతిని ఎన్నుకుంటాను. అలా ఒక చేతిని నేను ఎన్నుకున్న పిదప ఆ చేతికి సంబంధించిన అతివయొక్క రూపురేఖలు సహజంగా వుట్టిపడులాగున చక్కని విగ్రహం తయారుచేయకలిగినచో ఆ వ్యక్తిని నా స్వంతం చేయాలి. ఆ చేతిని, ఆ చేయికలిగిన అతివను నాకు ఒప్పగించాలి. ఇది నా షరతు.

భారతదేశ నారిని నా భాగస్వామిగా పొందాలని నా ఆకాంక్ష. కనుక అట్టి అతివ యీదేశ సార్వభౌముని రాజ ప్రసాదంనుండి పొందితే, అది నా అదృష్టం. నా కళాతృష్ణను యీ విధంగా సార్థకం చేయాలని తపిస్తు

న్నాను. ప్రభువయినా యీ షరతును అంగీకరిస్తే వెంటనే నేను సిద్ధం" అన్నాడు.

చక్రవర్తి మహారాణి ముఖం చూశాడు. ఆమెతో మాట్లాడాడు.

"అలాగే అంగీకరించండి. దానికి కావలసిన ఏర్పాట్లన్నీ నేను చూచుకుంటాను" అన్నది రాణి.

మహారాణి వెంటనే రాణివాసంలో పనిచేసే పరిచారికలను, పాతిక మందిని పిలిపించింది. దగ్గరలో ఒక తెర కట్టించి దాని వెనుక అందరినీ నిలబెట్టి, వారి చేతులను ఆ తెర బయటకు కనపడునటు జూపమని ఆజ్ఞాపించింది. ఆ తెరకు చిన్న రంధ్రములు చేసి, ప్రతివారు ఒక్కొక్క చేతినే తెరగుండా బయటకు చాపే ఏర్పాటు చేయబడినది. ఇది తిలకించేందుకు, షాజహాన్ చక్రవర్తి, రాణి ముంతాజ్, తక్కిన సభాసదులు అందరూ హాజరయినారు.

షిరాజీ లేచి మెల్లగా తెరవైపు కదిలాడు. చేతులు జాపి వున్న వరుసలో నడుస్తున్నారు. ఒక్కొక్క చేయి పట్టుకొని పరికించి చూస్తూ వెళుతున్నాడు. ఒకటి, రెండూ, మూడు. నాలుగు అలా ఒకదాని తరువాత ఒక చేయి చూస్తూ పోతున్నాడు. అలాపోతూ ఒకచేతిదగ్గర ఆగిపోయాడు. ఆ హస్తాన్ని స్పృశించాడు. తీక్షణంగా పరికించి చూచిన తరువాత ఆచేతి కొక గాజు తొడిగాడు. అంటే ఆ చేతియొక్క ప్రతిరూపాన్ని పాలరాతిపై మలచుటకు నిర్ణయించినట్లు నిదర్శనమన్నమాట.

అలా జరుగగానే మహారాణి తెరవెనుకకు, అతడెన్నుకున్న పరిచారిక ఎవరో తెలుసుకొనుటకు వెళ్ళింది. అతడెన్నుకున్న సౌందర్యవతి ఎవరనుకుంటున్నారు? ఎవరోకాదు ఆమె యువరాణి. దురదృష్టవశాత్తున పొరపాటు జరిగిపోయింది. విషయం గమనించిన మహారాణి కంగారుపడిపోయింది. ఇలా ఎందుకు జరిగిందని యువరాణిని మందలించింది. ఐతే

కేవలం వినోదానికి, ఏమిజరుగుతుందో చూద్దామని తన చేయికూడ పరిచారి కల చేతులతోపాటు జాపానన్నది.

యువరాణి పేరు "రెహనా" ఆమె అసలు రాజదంపతుల కుమార్తె కాదు. ఒక సేనాదిపతి కుమార్తె ఆ సేనాదిపతి చక్రవర్తి కొరకు మారణ హోమంలో యుద్ధంచేస్తూ వీరమరణం చెందాడు. మరణకాలంలో చక్ర వర్తితో తన ఏకైక ముద్దుబిడ్డ రెహానాను చేరదీసి, స్వీకరించి, పెంచి పెద్ద చేయమని ప్రార్థించాడు.

చక్రవర్తి తనకొరకు ప్రాణాలు సైతం అర్పించిన ఆ సేనాపతి కోర్కె నంగీకరించి, స్వంత బిడ్డవలె అల్లారుముద్దుగా పెంచాడు. ఆ బిడ్డ తల్లి అంతకు ముందే ఎప్పుడో మరణించివున్నందున తన చిన్నతనము నుండి రాజప్రసాదంలో చొరవగా తిరుగుతూ రాజదంపతుల అభిమానం పొందివున్నందున చక్రవర్తి, మహారాణి కూడ ఆమెను తమ స్వంతబిడ్డగా చూసుకున్నారు. చివరికామె యువరాణి అయినది.

మరి అందుచేతనే ఆమెను ఈ సామాన్యునికిచ్చి వివాహం చేయు టకు అంగీకరించలేకపోవుట సహజమవుతుంది. అయితే యిప్పుడేమి చేయాలి? రాణి విషయమంతా చక్రవర్తికి తెలిపింది. ఇరువురు ఆలోచనలో పడ్డారు. తర్క వితర్కాలు అయిన తరువాత యిరువురూ తమాయించు కొని ఒక నిర్ణయానికి వచ్చారు.

"ఇదంతా అసలు అతడు ముమ్మూర్తులా యువరాణి రూపురేఖలు పుట్టిపడేలా విగ్రహం చెక్కినప్పుడు కదా! దీనిగురించిన ఆలోచన. అసలు మనిషిని చూడకుండా అదే రూపురేఖలతో ఆ మనిషి విగ్రహం చేయటం యెవరికీ సాధ్యంకాదు. అతడు అలా చేయలేడు." అని సరిపుచ్చుకొని ఫలితం కొరకు ఎదురు చూస్తున్నారు.

షిరాజీకి ఒక ప్రత్యేక గది యివ్వబడింది. ఒక పాలరాతిని కూడ

ఒప్పగించారు. అతడికి కావలసిన సదుపాయాలన్నీ ఆ గదిలోనే ఏర్పాటు చేయబడ్డాయి. షిరాజీకూడ ఎంతో ఆదుర్దాగా వున్నాడు. రాత్రింబగళ్ళు పని చేస్తున్నాడు. అతని మనస్సంతా తన పనియందే లగ్నంచేసి కళా నైపుణ్యంలో లీనమైపోయాడు, అలా తన హృదయ కళానైపుణ్యంతో రాజును, రాణిని మెప్పించి ఆందాలరాసిని చేపట్టాలనే ఆకాంక్ష మదిలో బలీయ మైంది.

విగ్రహం తయారీ రెండుమూడు నెలలు పట్టింది. ఒకరోజున తన పని పూర్తయినట్లు శిల్పి రాజప్రాసాదానికి కబురంపాడు కబురువిన్న రాణి, చక్రవర్తి, శిల్పివున్న గదికివచ్చి ఎదురుగావున్న రూపంచూసి స్తబ్ధులై పోయారు. అక్కడ "రెహనా వచ్చి నిలబడిందా ఏమి?" అని ఆశ్చర్యంతో పట్టుకుచూచారు. ఆమె రెహనాకాదు, రెహనా ప్రతిరూపం. నిశ్చేష్టులై పోయారు. ఏమిచేయాలో పాలుపోలేదు. అంతా అయోమయంగా తయా రైంది. ముందంగీకరించిన షరతు ప్రకారం యిప్పుడు తమ యువరాణిని, ఒక సామాన్యునికి ఎలా యివ్వగలరు? ఇది భయంకర షరతై కూర్చుంది.

రాజుకు షరతు గుర్తురాగానే మనస్సు ఎదురు తిరిగింది. షిరాజీతో అన్నాడు.

"చూడు షిరాజీ! యీ అతిలోక సౌందర్యమూర్తి మా యువరాణి. నీవు అత్యద్భుతంగా శిల్పాన్ని మలిచావు. నీ ప్రతిభకు నా జోహార్లు. ఈమెను తప్ప నా రాజ్యంలో నీకు కావలసిన మరేదయినా సరే కోరుకో, నీ కోరిక తీరుస్తాను" అన్నాడు.

అందుకు షిరాజీ "రాజా! నేనీ విషయంలో అసలుఏమీ ఆలోచించ లేదు. కేవలం శిల్పంలో లీనమై నా వూహాసుందరిని ఊహించుకుంటూ ఈ గొప్ప కళాఖండాన్ని సృష్టించానంతే! నేనీ రాజకుమారిని అడుగబోవుట లేదు. నాకేమీ అక్కరలేదు" అన్నాడు.

"లేదు లేదు. నిన్ను యింతటి శిల్పకళాధురీణుని, వట్టిచేతులతో పంపుటకు అంగీకరించను" అని రాజు వ్యధన పడ్డాడు. ఇక్కడ రాజుగా తానా శిల్పికి వాగ్దానం చేశాడు. కనుక తనహామీని పాటించాలి.

అందుకే శిల్పితో "ఈ యువరాణి తప్ప నా రాజ్యంలో ఏ యితర అందగత్తెనయినా సరే కోరుకో ఇప్పిస్తాను." అన్నాడు రాజు.

అందుకు శిల్పి "అక్కర్లేదు మహారాజా! నేను సంతుష్టుడనయితిని. నాకేమీ అక్కర్లేదు. నేను ఎలా వచ్చానో అలాగే నా దేశం వెళ్ళిపోతాను" అన్నాడు.

రాజు, రాణీ, శిల్పిలతోపాటు యువరాణీ రెహనాకూడ జరిగినదానికి విచారిస్తున్నది. అసలు దాని కంతటికీ తానే కారణమని, తన మూలంగానే యిదంతా జరిగిందని రెహనా బాధపడింది. ఆ సమయంలో మహారాణి విండు చూలాలు. అసలే బలహీనంగా వున్నది. అందులో గర్భవతి, దీనికి తోడు మానసిక సంక్షోభానికి గురైంది. ఈ సంఘటనతో మరీ అస్వస్థతకు గురై మంచం పట్టింది.

రాజుకు ఏమీ పాలుపోక ఈ సమస్య నెలా పరిష్కరించాలో అవగాహనకు రాలేక ఏకాంతంగా గడుపుతున్నాడు. అనారోగ్యంతో వున్న మహారాణి ఒకరోజున చొరవ తీసుకొని శిల్పిని తన గదికి పిలిపించింది. తాను చాలా బలహీనంగా వున్నానని, ఈ విషయంలో ఏమి చేయాలో పాలుపోవుటలేదని అన్నది. శిల్పిని ఎట్టి పరిస్థితులలోను ఒట్టి చేతులతో పోవద్దని అర్థించింది. యువరాణిని తప్ప మరెవరినయినా కోరుకొమ్మన్నది.

శిల్పి అంతా విన్నాడు. "అమ్మా! మీరేమీ విచారించకండి. మీరు ఈ రాజ్యానికి మాతృతుల్యులు. మీరేమీ వ్యథపడవద్దు. నేను సంతోషంగా వెళ్ళిపోతాను. పోనివ్వండి" అని అభ్యర్థించాడు.

మరి రాణి కోరేది యీ సమాధానం కాదు. వారు ముందుగా ఆడిన మాట ఎలా తప్పగలరు? మరి అలా మాటతప్పితే ఇతరులు వీరిని గురించి

ఎంత చులకన చేస్తారు? అందుకే అపవాదు రాకుండా సమస్యా పరిష్కారానికి రాణి చేయగలిగినంతా చేసింది.

శిల్పేమో, ససేమిరా నాకింకేమి వద్దంటాడు. రాజదంపతులు యువరాణిని చేజేతుల వప్పగించుటకు అంగీకరించలేకపోతున్నారు. ఈ వ్యధలోనే రాణికి కాన్పు వచ్చింది. కాన్పు కష్టమై చివరకు ఒక బిడ్డను ప్రసవించి రాణి శాశ్వతంగా కన్నుమూసింది రాణి మరణవార్త విన్న చక్రవర్తి హృదయ విదారకంగా శోకించాడు. ఆయన తన భార్య ముంతాజ్‌ను ఎంతో గాఢంగా ప్రేమించాడు. ఆమె ఎడల మక్కువ ఎక్కువ. భార్య వియోగంతో వున్న చక్రవర్తికి శిల్పి సమస్య ఒకటి తోడయింది.

పిచ్చివాడిలా తయారయిన రాజుకు ఆయన ప్రధానమంత్రి ఒక పరిష్కార మార్గం తెలిపాడు.

"మీకు ముంతాజ్ ఎడల ఎనలేని ప్రగాఢ ప్రేమ వున్నది కదా! మీ ప్రేమైకమూర్తి మహారాణిపేర ఒక గొప్ప స్మారకచిహ్నాన్ని తయారు చేయించండి. అట్టి చిహ్నం ఆమె అందచందాలకు, ఆమెయందు మీకున్న ప్రగాఢ ప్రేమకు ప్రతిరూపంగా వుండాలి. షిరాజ్ ఒక గొప్ప శిల్పకారుడు. వాస్తుకళ బాగా తెలిసినవాడు. కనుక యిట్టి కట్టడపు నమూనాను తయారు చేసి చూపమని ఆ శిల్పిని ఆజ్ఞాపించండి. అలా మీకు నచ్చిన నమూనా ఆతడు తయారు చేయకలిగితే రెహానాను ఆతనికిచ్చి వివాహం చేయగలమని చెప్పండి." అని మంత్రిరాజుతో చెప్పాడు.

ఈ సలహా రాజుకు నచ్చింది, శిల్పిని వెంటనే పిలిపించారు. మంత్రి చెప్పినట్లు తన కోరిక వెలిబుచ్చాడు. భావితరాలవారికి చిరస్థాయిగా, స్మారక చిహ్నంగా వుండిపోగల చక్కని భవన నిర్మాణానికి అవసరమగు నమూనా తయారుచేసి యిమ్మని కోరాడు. ఆ నమూనా తనకు నచ్చితే రెహానా తన స్వంతం కాబడునని హామీ యిచ్చాడు.

రాజు కోరికకు శిల్పి అంగీకరించాడు. రోజుల తరబడి ఎన్నెన్నో

నమూనాలు తయారుచేసి చూపిస్తున్నాడు. ఏ ఒక్కటీ కూడా రాజు హృదయానికి హత్తుకుపోవటంలేదు. శిల్పి కృషి ఫలితానికి రాజు ఎన్నటికీ సంతృప్తిపడే అవకాశం కనపడుటలేదు. ఫలితంగా రాజప్రసాదంలో కాక, రాజ్యమంతా అయోమయంగా తయారయింది. రాజులో దుఃఖం పెరిగింది రెహనా పరిస్థితికూడ అలాగే తయారయింది.

మళ్ళీ ప్రధాని, రాజువద్ద మంతనం చేశాడు. "నిజానికి యీ శిల్పి హస్తకళయందు అరితేరినదిట్ట అయినప్పటికీ అతని కృషితో మీరెన్నటికీ సంతృప్తి పడలేకపోవుటకు కారణం, మీ హృదయం చెదిరివున్నది, శోకతప్తమై విచారంలోవున్నది. అతని హృదయం అలా బ్రద్దలుకాలేదు. మీ హృదయంవలె అతని హృదయం గాయపడలేదు. కనుక మిమ్ములను తృప్తిపరచే నమూనా ఎన్నటికీ చేయలేకపోతున్నాడు. మీ హృదయం గాయపడినట్లే, అతని హృదయంకూడ గాయపడాలి. అప్పుడు గాయపడిన హృదయంతో అతడు చేసే నమూనా అత్యద్భుతంగా తయారు కావచ్చును" అని సలహాచెప్పాడు మంత్రి.

"అవునుసరే, అందుకు మనమేమి చేయాలి?" అని ప్రశ్నించాడు రాజు.

మంత్రి సలహా చెబుతున్నాడు "మనం మెల్లగా రెహనాకు సుస్తీగా వున్నదని పుకారు వ్యాపింపచేయాలి ఒకవారం గడిచిన తరువాత ఆమె పరిస్థితి మరీ క్షీణించినట్లు చెప్పాలి. మూడవవారంలో ఆమె అనారోగ్యం ప్రమాదంగా పరిణమించినట్లు చెప్పాలి, నాల్గవవారంలో ఆమె మరణించినట్లు చెప్పాలి" అని చెప్పాడు.

చివరకు ఆ విధంగానే చేయబడింది. రెహనా మరణించినట్లు విన్న తరువాత షిరాజ్ తయారుచేసిన ప్రథమనమూనా, అత్యద్భుతంగా వుండి రాజుతో సహా అందరూ మెచ్చుకున్నారు. దానిప్రకారమే అప్పటి తాజ్ మహల్ నిర్మాణం జరిగింది. ఇదీ యీనాడు మనంచూచే అత్యద్భుత కళా

ఖండం, మనకున్న ప్రపంచ ప్రఖ్యాత వింతలలో ఒకటైన మహాభవనం ఆనాటి షిరాజీ తయారుచేసిన అపూర్వ కళాసృష్టి ఫలితం.

చివరకు రెహానా విజంగానే మరణించింది. మరి ఆమె మరణానం తరం, ఇంకా తాను జీవించుటకు మరేదీ లేనందున షిరాజీకూడ మరణిం చాడు. చివరకు రాజుకూడ తనకు తానే స్వయం మరణం తెచ్చుకొనుటతో ఈ స్మారకచిహ్నం తప్ప మరేదీ మిగలలేదు. ఈ స్మారకచిహ్నమైన అపురూప భవనం శాశ్వతంగా మిగిలిపోయి యీనాటికీ ప్రపంచం నలు మూలలనుండి అశేష ప్రజానీకాన్ని ఆకర్షిస్తున్నదంటే కారణం దానివెనుక అంతటిప్రేమ, బలీయమైన ప్రేమాగ్ని దాగివున్నది. కళాసృష్టిలో దివ్య ప్రేమ అంతర్లీనమై యున్నది.

## క్రమశిక్షణ

మానవుడు జనన మరణముల కతీతుడు. జనన మరణములనేవి ఒక విషవలయం. ఈ వలయంలో చిక్కుకున్నవాడు, మనసావాచా కర్మణా క్షణక్షణం సంస్కారములు పెంచుకుంటూ ఫలితంగా చావుపుట్టుకల అనుభ వం పొందుతూ ఈ సృష్టిలో అనాదిగా వుంటూనే వున్నారు.

సృష్టి పరిణామక్రమం నుండి తప్పించుకొని భగవత్సాయుజ్యం పొందాలనే తపన మానవుని మస్తిష్కంలో మెదులుతూనే వుంటుంది. తన గమ్యం చేరుటకు కేవలం సద్గురు కృపాకటాక్షము మాత్రమే శరణ్యం.

ఆట్టి సద్గురువు కృప పొందగలగాలంటే, ఆయనకు విధేయులై ప్రేమతో శుశ్రూషచేసి, వినయంతో సర్వము పరిత్యజించి, ఎట్టి కోరికలూ లేక అంకితమైపోవాలి. ఎవరైతే సద్గురు సేవలో ప్రేమార్పణ చేసుకొని క్రమశిక్షణతో విధేయులై సేవిస్తూ జీవించి, ప్రేమతోనే ఆయనను విడనాడక మరణిస్తారో అట్టివానికంటే గొప్పవారు మరొకరుండరు. అట్టివారిని గురువు తనంతవారిగా చేయును.

మెహెర్ బాబా తన కార్యక్రమాన్ని బెంగుళూరులో గడుపుతున్న రోజులవి. అక్కడి ఏర్పాట్లన్నిటిపైనా అజమాయిషీ బాధ్యత డా॥ ఘనీపై వుండేది. ఆశ్రమాన్ని నడుపుటలో దూబరా ఖర్చులు నివారించి, మిత వ్యయంతో ఎవరయితే వ్యవహరిస్తారో వారు తనను అమితంగా సంతోష పెట్టగలరని బాబా ముందుగా ఒక హెచ్చరిక యిచ్చారు.

ఆగా బైదుల్‌కి వంటపని వప్పగించబడింది. బాబా సలహాని తు.చ. తప్పక ఆచరించి, ఆయనను సంతుష్టుడిని చేయాలని బైదుల్ తపించేవాడు. వంటకాలలో చౌకగాదొరికే సొరకాయలు ఎక్కువగా కొనేవాడు. రెండు పూటలా అన్నంలోకి సొరకాయ వంటకమే వండేవాడు. ప్రొద్దుటే ఉపాహారంలో కూడ సొరకాయ కూరే వండుతున్నాడు. రోజూ విడవకుండా సొరకాయలే వాడుటవలన మండలిలో చాలామందికి ఆరోగ్యం దెబ్బ తిన్నది.

కొందరికి జలుబు, కొందరికి కడుపునొప్పి, మరికొందరికి వెగటు ఇలా రకరకాలుగా అందరూ బాధపడుతున్నారు. ఏ ఒక్కరికికూడ ఈ విషయాన్ని ఆయన దృష్టికితెచ్చే ధైర్యం లేకపోయింది. ఈ విషయం ఆయనకు చెప్పినచో అది పితూరీక్రిందకు వచ్చి ఆశ్రమనియమం ఉల్లంఘించినట్లు కాగలదు. కనుక శిష్యులంతా ఈ సమస్యనుండి బయటపడే ఉపాయం ఆలోచించమని డా॥ ఘనీని కోరారు.

డా॥ ఘనీ బుర్ర అతిచురుకైనది ఒకపాట కట్టాడు. "మేరే బైదుల్‌నే కోలా పకా యాహై ఆజ్" అంటే. "బైదు ఈరోజు సొరకాయ వండాడు" అని పాట వ్రాశాడు. ఈ పాటను మరో శిష్యుడు బాబూ రావు సాంగ్లే అనే అతనికి యిచ్చి, బాబా మంచి హుషారులోవుండి ఏదైనా పాట పాడమన్నప్పుడు యీపాట పాడమని అన్నాడు.

ఆ వెనువెంటనే సందర్భం కలసివచ్చింది. అవకాశం దొరికింది. ఒకరోజు ఆయన మండలితో వున్నపుడు మంచిపాట పాడమన్నారు.

సాంగ్లేలేచి, మధురస్వరంతో ఘనీ వ్రాసిచ్చిన పాటపాడాడు. బాబా ఏవి ఎంతో ముగ్ధులైనారు. పాటలోవున్న గూఢార్థాన్ని ఆయన ఆ తరువాత వెలికిలాగారు. వైదులు చేస్తున్న పొదుపును ఆకడిని మందలించాడు. వంట యింటిని స్వయంగా పరిశీలించి, మిగిలివున్న సొరకాయలన్నీ పాతిపెట్టించారు.

## దైవ ప్రేమ

ప్రేమవేరు, ప్రేమవాంఛవేరు. ప్రేమించినప్పుడు అది మనము యిచ్చినట్లు. మరి ప్రేమలో పడినప్పుడు, అది ఆశించినట్లు కాగలదు. ప్రేమ భగవంతుడంతటి స్వచ్ఛమైనది. అది యిచ్చునేకాని దేనినీ అడుగదు. అందుకు భగవంతుని కృపకావాలి. "చాల గొప్పయోగులు పెద్దపెద్దగడ్డాలు, మీసాలు పెంచుకొని, ధ్యానసమాధిలో సంవత్సరముల తరబడి కూర్చున్నా యీ ప్రేమను పొందలేకపోయారు" అన్నారు బాబా. ప్రేమ అంతటి అద్భుతమయినది.

తల్లి తనబిడ్డకొరకు మరణిస్తుంది. అది అత్యుత్తమమయిన త్యాగం. అయినప్పటికీ అది ప్రేమకాదు. యోధులు తమ దేశంకొరకు వీర మరణం పొందుదురు. ఇదీ ప్రేమకానేరదు. "యధార్థప్రేమ నీలో ఉద్భవించినప్పుడే దానిని నీవు గ్రహించగలవు. వ్యావహారికంగా నీవు దానిని తెలుసుకొనలేవు. అనుభవపూర్వకంగా మాత్రమే తెలుసుకోవాలి" అన్నారు బాబా.

ఇట్టి ప్రేమను చేర్చేది దైవకృప. కృప చౌకగా కొనుటకు బజారులో దొరికేదికాదు. అది ఎల్లప్పుడూ యితరులకు సేవచేయుటకు సిద్ధంగా వుండి, యితరులనుండి సేవను కోరనప్పుడు మాత్రమే లభ్యమగును. "స్వార్థం విడనాడి, పరులక్షేమం కాంక్షించాలి. పరనింద చేయరాదు. సహనము పాటించాలి, వ్యధచెందరాదు, పరులలోని మంచినే గ్రహించాలి, తప్పులెన్నరాదు. ఇవన్నీ ఆచరిస్తే దైవకృప నీతోనేవుంటుంది" అంటారు బాబా.

ప్రేమను, ప్రేమ గాంభకు భేదంచెప్తూ ఆయన ప్రేమంటే ఎలా వుండాలో చెప్పారు "మజ్నూ లైలాను ప్రేమించాడు. అది ఎలాటిప్రేమ? ప్రతి వస్తువునందు, ప్రతిచోట ఆతను లైలాను చూచేవాడు. ఆమెను తలచకుండా ఒక్కక్షణంకూడ వుండేవాడుకాడు. నిద్రాహారాలు, అన్న పానాలు సమస్తం ఆమెను తలవక ఎరుగడు. అనుక్షణం ఆమె సుఖాన్నే అతడు కాంక్షించాడు. ఒకవేళ ఆమె మరొకరిని వివాహమాడిన, సుఖపడ గలనవి తలచినచో, అలా వివాహమాడుటకు అతను ఆనందంతో అంగీక రించి, చూచి ఆనందించగలిగేవాడు."

"లేదా ఒకవేళ ఆమె భర్త తన మరణంతో ఆమె సుఖపడగలదని భావిస్తే తానలా మరణించుటకు ఆనందంతో అంగీకరించేవాడు. లైలా యందు మజ్నూకున్న ప్రగాఢప్రేమ తుదకాతనిని నా వద్దకు చేర్చినది. ఇక్కడ కేవలం ప్రియురాలి ఆలోచన తప్ప మరి యెట్టి స్వార్థచింతనలేదు. ప్రతిక్షణం అవిచ్ఛిన్నంగా అదే ఆలోచన. ఒకవేళ మీరలా ప్రయత్నించి నప్పటికీ అలా చేయలేరేమో! ఇట్టి నిరంతర ప్రేమధారకు కృపకావాలి. చేసే ప్రయత్నం అట్టికృపను చేరుస్తుంది. భగవంతుడంటే ఏమిటి? ప్రేమ. అనంతమగు ప్రేమదైవం" అన్నారు బాబా,

దైవకృపకు పాత్రుణిగా చేసే ప్రేమ ఎలావుండాలో డా॥ ఘనీ ఒక చక్కని సంఘటనద్వారా వివరించారు.

ఒకప్పుడు "హజరత్ నిజాముద్దీన్ ఆలియా" అనే సద్గురువుండే వారు. ఒకరోజున బ్రహ్మాండమయిన సంగీతసభ జరుగుతోంది. సద్గురువు ఆ సంగీతసభలో పాల్గొన్నారు. గాయకులు దైవప్రేమపై మధురగానం చేస్తున్నారు. గానమాధుర్యానికి శ్రోతల హృదయాలు పరవశించిపోతు న్నాయి. శ్రావ్యమైన ఆసంగీతం తారాస్థాయికి చేరింది. ఆ తన్మయత్వంలో సద్గురువు సమాధిస్థితికి చేరారు. తన చేతిరుమాలు పైకెత్తి వూపుతూ "ఆహా! నేను కనీసం ఆ రజకపుత్రునితోనైనా సమానం కాలేకపోతిని కదా!" అంటూ విలపించసాగారు.

ఆయన చుట్టూ పరివేష్టించివున్న శిష్యులు, సేవకులు, భక్తులు యావన్మంది కూడ గురువు చర్యకు విస్తుపోయారు. ఆయనయందున్న భక్తి ప్రపత్తుల కారణమున గురువుచేసిన విశ్లేషణానికి హేతువేమిటో తెలుసుకొన ప్రయత్నించలేకపోయారు. కాని కొన్ని రోజులు గడిచిన తరువాత ఆయనకు సన్నిహితంగా మెలిగే అమీర్ ఖుస్రో అనే శిష్యుడికి ఈ విషయాన్ని గురువుముందు ప్రస్తావించే అవకాశం దొరికింది. అప్పుడు గురువిలా చెప్పదొడగెను.

ఒకానొక సంస్థానంలో ఒక రాజుండేవాడు ఆ రాజకుటుంబంవారి దుస్తులు వుతుకుతూ ఒక రజకయువకుడు లాండ్రీ నడుపుతున్నాడు. ఆరాజు గారి కుమార్తె యువరాణి చాల అందమైనది. ఆమె అందచందాల గురించి నలుగురూ చెప్పుకుంటూ వుంటే ఈ రజక యువకుని చెవిలోపడింది. యువరాణి రూపురేఖలు ప్రత్యక్షంగా చూడకుండానే వూహిస్తూ, కలలుకంటూ రోజులు గడుపుతున్నాడు. నిత్యం ఆమెనారాధిస్తూ, ఆమె దుస్తులువుతికే సమయంలో ఎంతో కళాత్మకంగా, జాగ్రత్తవహించి, శ్రద్ధగావుతికి తన ప్రేమను ఋజువు చేసుకొంటున్నాడు.

కొంతకాలమా యువకుడు, యువరాణిపై తనప్రేమను అతిరహస్యముగా వుంచి ఆరాధించాడు. అంతరంగంలో మాత్రం ఆమెను ఊహించి ప్రేమిస్తున్నాడు. కాని ఆమెను చూడనేలేదు. ఆమెను ఆరాధిస్తూ పరితపిస్తున్న అతని ఆరోగ్యం రానురాను క్రమంగా క్షీణించసాగింది. తల్లి ఎన్నివైద్యాలు చేయించినా ఫలితం లేకపోయింది.

తల్లి అతని ఆరోగ్య భంగానికి మూలకారణం తెలుసకోగలిగింది. విషయం తెలిసిన తల్లి భయపడిపోయింది. ఒక సేవకుడు, యువరాణిని వివాహమాడకోరుట అంటే నావుబ్రతుకుల సమస్య. మరి కుమారుని ఆరోగ్యము కుదుటపడాలంటే, అందుకు తరుణోపాయం ఆలోచిస్తేనేకాని సాధ్యపడదు. తుదకామె యువరాణిపై తన కుమారుని ప్రేమ తగ్గుటకొక వుపాయ మాలోచించింది.

ఒకరోజున రాజప్రసాదం నుండి తిరిగివచ్చిన తరువాత గుండెలు బాదుకుంటూ, మిక్కిలి రోదిస్తూ నెత్తిపై బాదుకుంటూ, ఆవేదన వ్యక్తపరుస్తూ విలపించసాగింది. బాధతో తన కుమారునికి యువరాణి మరణించినట్లు దుర్వార్తగా చెప్పింది. విషాదవార్త విన్న రజకయువకుడు విషణ్ణవదనుడైనాడు. దుఃఖిస్తూ ఒక్కక్షణం మౌనంగా వుండి, మరుక్షణంలోనే, అమిత వేదనతో ఒక కేకవేసి తనువు చాలించాడు.

ఊహించని పరిణామానికి ఆమె మనస్సులో, అప్పుడు చెలరేగిన భావాలు, ఆలోచనలు ఒక్కసారి వూహించుకోండి! పాపమామె తాను చేయు చర్యకు ప్రతిఫలంగా, యిటువంటి విషాద సంఘటన జరుగగలదని వూహించలేకపోయింది. కొద్దిసేపటికి తెప్పరిల్లి గుండె దిటవు పరచుకున్నది. తన కుమారుని హఠాన్మరణ కారణం, యితరులెవరికీ చెప్పలేకపోయింది. రహస్యాన్ని గోప్యంగానే వుంచినది. విషాదాన్నంతా తన హృదయంలోనే వుంచుకొని, వ్యధతో ఒంటరిగా బ్రతుకు కొనసాగిస్తున్నది

ఒకరోజున యధాప్రకారం, ఇస్త్రీ బట్టలు తీసుకొని, ఆ రజకకాంత రాజప్రసాదానికి వెళ్ళింది. బట్టలు చూచిన యువరాణి యధాలాపంగా "చాకలీ! ఈమధ్య నీవు చేస్తున్న యిస్త్రీ వుతుకు యిదవరకటిలా శుభ్రంగా వుండుటలేదు. యిస్త్రీ కూడ అంత బాగుండుటలేదు. మునుపటిలా వచ్చే యింపయిన వాసనలు యిప్పుడు గుబాళించుట లేదు, కారణమేమిటి?" అని ప్రశ్నించింది.

యువరాణి ప్రశ్నతో, రజకకాంత, తనలో దాచుకున్న వ్యధను ఇహ ఎంతమాత్రం అణచుకొనలేక పోయింది. ఒక్కసారిగా దుఃఖము వెల్లుబికి విలపించ సాగింది. సంగతి తెలియని యువరాణి ఓదార్చుటకు ప్రయత్నించింది. కొద్దిసేపు గడచిన తరువాత, గుండె దిటవు చేసుకొని, తన కథనంతా వివరించింది.

దుఃఖపూరిత మైన విషాదాంత కథ నెంతో ఆవేదనతో యువరాణి వినసాగింది. మౌనంగా, తనను ప్రేమించిన ఆ అదృశ్య ప్రేమికుని, రూపు రేఖలను, అతని నిర్మల ప్రేమను వూహించుకుంటున్నది చివరకు అతడి సమాధి దర్శించాలని తలచింది. ఆతడిసమాధి ఎక్కడ వున్నదో చూపమని యువరాణి ప్రతిమలాడింది. అది ఎంత ప్రమాదమయినదో ఎరిగిన రజక కాంత వణకిపోయింది.

పట్టు విడువని యువరాణి అర్ధరాత్రి రాజప్రసాదం విడిచి బయటకు వస్తాను తీసుకువెళ్ళమని వత్తిడి చేసింది. చివరకు యువరాణి ఎలాగో రాజ ప్రాంగణం నుండి ఒకనాటి రాత్రి బయటపడి, రజకయువతితో స్మశానానికి బయలుదేరింది. ఆమె సమాధి చెంతకు చేరేసరికి. రజకయువకుని ప్రేమ జ్యోతి ఆమెలోని ప్రేమాగ్నిని వెలిగించింది. ఆశ్చర్యం గొలుపుతూ సమాధి తెరువబడింది. మరుక్షణంలోనే యువరాణి ఆ సమాధిలో వున్న యువకుని ప్రక్కనే సమాధి అయిపోయింది.

అసలే గుండె చెదరివున్న రజకకాంత యీ దృశ్యం చూచి నివ్వెర పోయింది. పరుగున వెళ్ళి జరిగిన సంఘటన రాజుకు వివరించింది. వార్త విన్నరాజు చలించిపోయాడు. జరిగిన నిజం తెలుసుకోవాలని ఆ సమాధి త్రవ్వి చూడమని ఆజ్ఞాపించాడు భటులతో దగ్గరుండి త్రవ్వించి చూడగా ఆమె చెప్పింది యధార్థమని రుజువైంది. రాజు తదితర రాజో ద్యోగులు, ఆ సమాధిలో ఏక శరీరులై శిరస్సులు మాత్రము వేరుగావున్న ఆ ప్రేమిక జంటను చూచి ఆశ్చర్యచకితులయినారు పరిస్థితి గ్రహించిన రాజు వెంటనే సమాధి పూడ్చివేయమని అజ్ఞాపించాడు. "దైవప్రేమ వారి నా విధంగా కలిపింది. కనుక మన మెంతమాత్రం, వారికి అంతరాయం కలిగించరాదు. కనుక మనం వెళ్ళిపోదాం పదండి." అంటూ రాజు తన బృందంతో తిరుగుముఖం పట్టాడు.

దైవప్రేమను గురించి ఆలపిస్తున్న గానమాధుర్యంలో లీనమైన సద్గురువు నిజాముద్దీన్ ఆరోలియా యీ కథను జ్ఞప్తికి తెచ్చుకొని "ఇట్టి

ప్రేమనే దైవప్రేమ అనబడుతుంది. ఈ మాదిరి ప్రేమే దైవసంధానం ప్రాప్తించే స్థితిని కలుగచేస్తుంది, మరి అటువంటి ప్రేమకు తను పాత్రుడిని కాలేకపోతినే" అని ఆ క్షణం వ్యసనపడ్డాడు. ఆ వైనాన్నే శిష్యుడు ఖుస్రూకు చెప్పాడు.

## ప్రేమ

ప్రేమ అనేది వూహించుకొన్నంతమాత్రంచేత జనించేది కాదు. తన కాంక్షను మనసా వాచా కర్మణా వినియోగించి, అనుభవపూర్వకంగా కృషి చేస్తేనే కానీ అది కలుగదు ప్రేమ అనేది తన అంతరంగంలో అవిచ్ఛిన్నంగా, ఏకధారతో కంపించాలి. అది వివిధమైన అంతర్బాహ్య ప్రేరణలతోనూ జనించదు

ప్రేమ, ప్రేమవాంఛ, యీ రెండూ సమాంతరములుగా ఎన్నడూ పయనించవు. ప్రేమ ప్రేమచేతనే పెల్లుబ్బబడుతుంది. అది తప్పని సరిగా స్వయంప్రకాశ శక్తి కలదై వుండాలి. ఎవరికయితే యిట్టిప్రేమశక్తి వుంటుందో వారినుండి అటువంటి ప్రేమశక్తి లేనివారు దానిని పొందగలరు యదార్ధ ప్రేమను ఎవరూ జయించలేరు. అది యిముడ్చుకొనలేనిది. అది శక్తిని కూడగట్టుకుంటూ తన శక్తిని వెదజల్లుకుంటూ పోతూ వుంటుంది. ఎంతవరకూ? కాలచక్రంలో అది సర్వ మానవాళిని స్పృశించునంతవరకూ అలా జరుగుతూనే వుంటుంది.

ప్రేమవాంఛ (కామం)లో జీవిత పతనావకాశమున్నది. సామాన్య భావంలో కామం భారంగా వున్నటు, ప్రేమ తేలికగా వున్న అనుభవము కలిగించును. కామపూరిత భావం నిరాశాభావం. ఈ నిరాశాభావం ఒక రూపంపై ఆధారపడి వుంటుంది. అంటే తానుకాక మరొక రూపమున్నట్లు భావన కలిగిస్తుంది. ఈ విధంగా కామంలో, ఎడబాటు, బాధ అనే ఆవేదన ద్యోతకమవుతవి. కానీ ప్రేమలో సమైక్యం సంతోషం అనే నిస్వార్ధ భావా

ఉండును. అందుకే కామం దుఃఖపూరితమైతే, ప్రేమ సంతోషదాయక మవుతున్నది.

కామం కోరికలకు కారణభూతంకాగా, ప్రేమ వ తేజానికి మార్గము కామం తృప్తిని కోరుతుంది ప్రేమ తృప్తిని అనుభవిస్తుంది. కామంలో అలసట వున్నది. మరి ప్రేమలో పూర్ణ సంతృప్తి వున్నది.

ప్రేమ శక్తిని ఎదుర్కొని జయించేదేదీ యీ విశ్వంలో లేదు. తుదకు అతివయే అయినప్పటికీ ఆమె ప్రేమతో శక్తివంతంగా నిలబడ కలిగినప్పుడు, ఏశక్తీ ఆమెకు కీడుచేయలేరు ఏ ఒక్కరూ ఆమెకు చెడు చేయలేరు. సహజంగా స్త్రీలు శక్తి సంపన్నులు. మహాయోధులుకూడ వారి ముందు పాదాక్రాంతులయినారు.

కనుక స్త్రీ అవివాహిత అయినప్పటికీ, పురుషులకు గొప్ప భోజ్య వస్తువై వారు ముక్తి సాధించుటకు సహాయపడగలుగును. ఒకవేళ అదృష్టము వరించి ఆమె స్వయం జీవనం గడిపేపరిస్థితి తటస్థించినపుడు అది మరీ సౌఖ్యవంతము. ఎందరో పసి హృదయాలకు, వయోవృద్ధులకు, యువకులకు సైతము ఆమె నిబ్బరంతో తన శక్తిని వినియోగించి మేలు చేకూర్చగలదు.

అందుకే బాబా అన్నారు "సౌందర్యవతులయిన ప్రతి బాబా ప్రేమికురాలు, యింకా ఎన్నెన్నో ఆత్మలను నా వద్దకు చేర్చుటకు తన అందాన్నే ఒక ఆయుధంగా వాడాలి. అట్టివారిలో మిక్కుటమగు నిలకడ వుండాలి ఒకప్పుడు "రబియా" అని ఒక వేశ్య వుండేది. సద్గుర్విణి బాబా జాన్ తన పూర్వజన్మలో ఈ రబియాగా జన్మించినది. విశ్వాల మనస్సుతో తన సౌందర్యాన్ని ఆయుధంగా ఉపయోగించి ఎంద రెందరో వ్యక్తులను ఆకర్షించేది. ప్రేమకు సరియగు అవగాహన వారిలో కలుగచేసేది దైవము సత్యము వయిపు వారి దృష్టిని మరల్చి తన ప్రేమ శక్తిచేత విగ్రహంతో వారిని దైవభక్తులుగా మార్చేది. అయినప్పటికీ రబియాకు బాబాజానుగా

జన్మించుటకు చాలాకాలం పట్టినది. తుదకామె సద్గుర్వినీ బాబాజానై, దైవత్వం నాలో మేల్కొలిపింది." అన్నారు.

అసలు రబియా కథను శిష్యులతో బాబా వివరంగా చెప్పారు. ఈరుచ్ ఒకానొక సందర్భంలో యిటీవల ఒక బాబా ప్రేమికురాలయిన వుపాధ్యాయురాలు బాబాను గురించిన ప్రేమ తత్వాన్ని తనవద్ద విద్య నభ్యసించే విద్యార్థులకు బోధించ ప్రయత్నించగా తుదకు వారు ఆమెపై ప్రేమను పెంచుకొనుటతో ఆమె చిక్కులలో పడింది. ఈరుచ్ వద్దకువచ్చి సమస్యకు పరిష్కారం కోరింది, ఆ సందర్భంలో ఈరుచ్ యీ రబియా కథను గుర్తుకు తెచ్చుకొని యీ వుపాధ్యాయురాలితో చెప్పాడు. ధైర్యంతో తన అందాన్ని ఆయుధంగా వినియోగించి, ప్రేమ అనే భ్రమలో పడిన విద్యార్థులను దైవప్రేమ వయిపు మరల్చమని హితబోధ చేశాడు.

ఆ కథను గురించి తెలుసుకుందాం. ఇది ఒకప్పుడు బస్రాలో వుండే ప్రసిద్ధ సద్గుర్వినీ రబియా కథ. ఆరురోజులలో యీమె యావత్ప్రపంచంలో కెల్ల అందమయిన ఆడెద అని జగత్ప్రసిద్ధి గాంచినది. ఆమె అందము యవ్వనం వర్ణించ నలవికావిది.

ఒకసారి యిరాన్‌లోని షిరాజ్ అనే పట్టణంనుండి ఒక యువకుడు బస్రా పట్టణం వ్యాపార నిమిత్తంగా వచ్చుట తటస్థించింది. అతడు ఎన్నెన్నో వూళ్ళు తిరుగుతూ, యాత్రికుడుగా బస్రాచేరాడు. అతడు వుత్సాహవంతుడు, అందగాడేకాక, వ్యాపార నైపుణ్యంకూడ కలవాడు. వ్యాపారంతో అనేక దేశాలు తిరిగాడు. బస్రా పట్టణంకూడ వ్యాపారం పని మీదనే వచ్చాడు.

వ్యాపార పనులు పూర్తి అయ్యాయి. సుందరమగు ప్రకృతి దృశ్యాలు చూడాలనే అభిలాష కలిగింది. వూళ్ళో చూడదగిన స్థలాలగురించి వాకబు చేశాడు. ప్రత్యేకంగా చూడతగిన విశేషమేమైనా వున్నదా? అని ఆరా తీశాడు. వింతగొలిపే విశేషముంటే చూడాలని తలంపు. ఎందరిని

విచారించినా అందమయిన ఉద్యానవనాలున్నాయనో, నీటిబుగ్గలనో అవి యివీ అంటూ ఏవేవో చెప్పారు. దేశదేశాలలో వున్న ఎన్నెన్నో నగరాలు సందర్శించిన యితడికి వీటిపై చూడాలనే మక్కువ కలుగలేదు.

వీటన్నిటికంటే అతీతమయిన విశేషమేదయినా వున్నదేమోనని మళ్ళీ విచారించుట సాగించాడు! ఒకతనిని అదే ప్రశ్న వేసేసరికి "లేకేమి? మా వూళ్ళో ఈ భూమికంతటికీ జగదేకసుందరి, సౌందర్యవతి యగు ఒక అతివ వున్నది." అన్నాడు. యావత్ప్రపంచంలోనే అందమగు సుందరాంగి అని వినేసరికి అచ్చెరువందాడు.

అందునా యితడు యువకుడై నందున, జగదేకసుందరి అని వినగానే అందమునకు ఆకర్షితుడైనాడు. పైకిమాత్రం గంభీరంగా "నేనెందరో అందమైన ఆడవారిని చూచాను. నాది యిరాన్ దేశం. ఇరాన్‌లోవుండే అందగత్తెలకంటే అందమైనవారు మరెక్కడా వుండరు" అన్నాడు.

"మీరెన్నిచెప్పినా తక్కినవారి అందం ఆమె ముందు దిగదుడుపే. ఆమె అంత సౌందర్యరాశి" అని జవాబువచ్చింది.

కానీ ఈ వ్యాపారికి వారి మాటలమీద గురి కుదరలేదు. అక్కడక్కడా తిరిగి మరొక్కసారి చూడతగిన విశేషమేదైనా వున్నదేమోనని విచారించాడు. వారుకూడ,బస్రాలో రబియాకంటే చూడదగినవిశేషం మరేదీ లేదనిచెప్పారు. దానితో ఆతనిలో వుత్సుకత బయలుదేరింది. "ఆమె అంత అందంగా వుంటుందా? అదెలాసాధ్యం? మీరెలా చెప్పగలుగుతున్నారు?" అని తిరిగి ప్రశ్నించాడు.

"ఎలా చెప్పమంటారు? అందానికి అర్థులు చాచేవారు ఆమె అందం చూచి నేర్చుకోవాలి" అని జవాబు వచ్చింది. మనస్సులో స్వయంగా చూడాలని నిర్ణయించుకున్నాడు. ఆమె వుండే తావు, చిరునామా తెలుసుకున్నాడు. ఆమె ఒక వేశ్య. వేశ్యవాడలో వుంటుందని విని పెదవివిరిచాడు. ఇరాన్‌లో

యిటువంటి వేశ్యలెందరినో ఎరిగివున్నందున ఈమె విషయంలో ప్రాధా న్యత లేదనుకున్నాడు.

వేరే సందర్భంలో మరోవ్యక్తి నోటినుండి కూడ రబియా అందం గురించి విన్నాడు. అలా యింకా యింకా ఎందరి నోటినుండియో రబియా అందం గురించి వింటూనే వున్నాడు. అలా జరుగగా జరుగగా చివరకు యీ బస్రానగరం తక్కిన నగరాలవలెకాక ఒక ప్రత్యేకత సంతరించుకున్న నగరముగా నిర్ణయించుకున్నాడు. యీ ప్రదేశం ఒక అతివయొక్క సౌంద ర్యము గురించి, స్వేచ్ఛగా సంభాషించుకొనే స్వతంత్రత కలిగియున్నదని తలచాడు, ఆమెను గురించి మాట్లాడే ఏ ఒక్కరూ ఎగతాళిగానీ, అసభ్యత గానీ ప్రదర్శించలేదు.

"ఏమిటీ విశేషం? ఆమె ఎవరై వుంటుంది? ఆమె సౌందర్యానికి మూలహేతువేమిటి?" అంటూ ఆలోచనలో పడ్డాడు. మనస్సేమో, ఆమె ఒక వేశ్య, అందంగావుంటుంది, అందరికీ అందుబాటులోవుంటుంది అందు చేతనే యింతమందిచేత శ్లాఘించబడినదని హెచ్చరించింది.

ఇలా ఆలోచిస్తూనే కొన్నాళ్ళు గడిపాడు. తుదకు ఆమె వేశ్య వాడలో వున్నాసరే రబియాను కలవాలని సంకల్పించాడు. అతడు న్యాయా ధికి ఏకపత్నీవ్రతుడు. ఎన్నడూ వేశ్యా సంపర్కం ఎరుగడు. కాని రబియా దగ్గరకు వెళ్ళిరావాలని నిశ్చయించుకున్నాడు. అతని జీవితంలో వేశ్యా గృహానికి వెళ్ళటం ఇదే ప్రథమం. ఎందరో ప్రజలు చెప్పిన ఆ సౌందర్య రాశిని చూడాలని తలచాడు.

ఆమె వుండేచోటు, చూడతగిన వేళగురించి తెలుసుకున్నాడు. సాయం సమయంలో ఒకరి సహాయంతో ఆమె యిల్లు చేరాడు. మెట్లెక్కి పైకి వెళితే గుమ్మంలో ఒక పరిచారిక తారసపడింది "ఏవూరండి? ఏంకావాలి? క్రొత్తవారివలె వున్నారే?" అంటూ పలకరించింది.

"అవును నేనీవూరికి క్రొత్తవాడినే బస్రానగర రబియాను చూడా లని వచ్చాను" అన్నాడు.

"ఏమిటండీ మీ ఉద్దేశ్యం? రబియాను చూడటమంటే, జంతు ప్రద ర్శనశాలలో జంతువులను చూసినట్లనుకుంటున్నారా ఏమి?" అని అడిగింది.

"ఏం? ఆమె అంత తేలికగా చూడటానికి వీలులేని వ్యక్తి మా?" అన్నాడు.

"అవును. మీరు అంత తేలికగా ఆమెను చూడవీలులేదు. ఆమెను చూచుటకేగాదు కొంతసేపు సేపు ఆమెవద్ద గడపాలన్నా తగిన రుసుము చెల్లించాలి" అన్నది.

"అంతేకదా! నేనామెతెంత కొంతతడవుండి గడుపదలచితిని."

"అలాగా! అందు కవుసరమగు రుసుము మీరు భరించలేరేమో?"

"ఎంతయినా సరే ఫరవాలేదు."

అంటూ వారిమధ్య సంభాషణ కొనసాగింది. చివరకు ఆమె కోరిన పైకం చెల్లించాడు. అప్పుడా పరిచారిక అతడిని ఒక గది వద్దకు తీసుకు వెళ్ళి లోనికి నెట్టి గబాలున తలుపు మూసింది.

గదిలోపల అంతా ఖాళీగా కనపడింది. అతనికొరకు ఎదురుచూసేవా రెవరూ కనపడలేదు. మెల్లగా నలుదిక్కులా పరికించి చూశాడు. ఒకప్రక్క వేరొక గది గవాక్షం కనపడింది. మెల్లగా తలుపు నెట్టి లోనికి చూచాడు. అందొక అతివ ధ్యానంలో నిమగ్నమై వున్నది. నేలపై తివాచీ పరచబడి వున్నది. దానిపై మోకాళ్ళమీద వంగి ఆసుందరి ధ్యాన సమాధిలో వుంది.

ఆమె అందమేమని చెప్పాలి? అంతటి సౌందర్యరాసిని ఆతనంతకు ముందెన్నడూ చూచి ఎరుగడు. ఆమెను గురించిన ఆలోచనలతని మన స్సులో చెలరేగినవి. ఈమె యిటువంటి వాడలో ఎలా వుండకలిగింది? కళంక జీవితమునేల అంగీకరించింది? ఇలా ఎన్నెన్నో తలంపులతో, ఆమె సౌందర్యము గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. అలాంటి ఆలోచనలతో అతడు పరిసరాలను చివరకు తననే మరచిపోతున్నాడు.

అంతలోనే అతనిలో అహం పెల్లుబికింది. ఆమె ప్రార్థనను పూర్తి చేసుకొనునంతవరకు ఎదురుచూచాడు. ఆమె అలా ప్రార్థనతో ఒక గంట గడిచింది. క్రమంగా అతనిలో ఏదో మార్పు ద్యోతకము కావచ్చినది. తదేకంగా ఆమెను చూస్తూ ఆమె సౌందర్యానికి ఆకర్షితుడయినాడు. ఆమెలో స్వచ్ఛమగు అమలినాన్ని చూడగలిగాడు.

మరొక గంటపాటు ఆమె తన ధ్యానాన్ని కొనసాగించి పూర్తి చేసింది. కళ్ళుతెరచి అతనివయిపు చూచింది. అప్పుడామె దృష్టి మెరపువలె అతని కళ్ళకు మిరుమిట్లు గొలిపినది. అట్టి చూపులతో ఆమె, క్షమాపణ కోరుతూ "క్షమించండి. యింతసేపు మిమ్ములను నాకొరకు ఎదురు చూచునట్లు చేసినందుకు విచారిస్తున్నాను. నేను మీరు వచ్చేసరికి దైవ ప్రార్థనలో నిమగ్నమై యున్నాను. ఆలస్యానికి మీకు కోపం వచ్చివుండవచ్చును" అంటూ చప్పట్లు కొట్టి పరిచారికలను పిలిచింది.

"ఈయన యీ రాత్రికి మన అతిథి విందుభోజనం ఏర్పాటు చేయండి." అని చెపుతూ "మీరేమయినా పానీయం సేవిస్తారా? ఏ మధువంటే మీకు యిష్టం?" అని యువకుని అడిగింది. తిరిగి అతని జవాబుకు ఎదురు చూడకుండానే షడ్రసోపేతంగా మధువుతో పాటు భోజన ఏర్పాట్లు జరిపింది. భోజనం చేస్తూ ఆమెను గురించి వూళ్ళోవాళ్ళు చెప్పిందంతా నెమరువేసుకుంటున్నాడు. "ఆమె సహజ సౌందర్యరాశి" అని తలపోశాడు.

అలా ఆలోచించుకుంటూ భోజనం పూర్తిచేసి, ఆమెతో సంభాషణ నుపక్రమించాడు. ముందుగా హృదయం విప్పి తన కథనంతా వివరిస్తున్నాడు. ఆమె వింటున్నది. ఆమెను చూస్తూ ఆమె అందాన్నంతా అనుభవిస్తున్నాడు, సంభాషణ మధ్యలో ఆమె కల్పించుకొని అతడి క్షేమ సమాచారములు తెలిసికొన్నది ప్రయాణంలో, వ్యాపారంలో కలిగే కష్ట నష్టాల

గురించి విచారిస్తున్నది. చివరగా అతడు బుస్రాలో అనేకులు ఆమె అంద చందాల గురించి చెప్పగా, ఆమెతో గడుపుటకు వచ్చానని తెలిపాడు.

"మీకు నా సుస్వాగతం. అయితే నాదేమంత అందం? ఇది యీ రోజు వుండి రేపు పోయేది. నాటకంలో వేషంవంటిది. త్వరలో నేను వార్ధక్య దశకు చేరుదును. శరీరమంతా ముడుతలు పడును. మీమీద, నా మీద వయస్సేకదా చెప్పేది." యిలా సంభాషిస్తూ ఆమె మూల సూత్రాన్ని పట్టుకున్నది. వారి సంభాషణ దైవము, సత్యము, అందము వయిపు మరలినది. అలా సాగిన వారి సంభాషణ తెల్లవారుజాము వరకు కొనసాగినది. తుదకామె అతనిని యదార్థ భక్తుడనే కేంద్రానికి చేర్చినది.

దీనినే మెహెర్బాబా యిలా చెప్పారు.

"కష్టాలు, బాధలు, ప్రమాదాలు ముంచుకువచ్చి మార్గంలో అడ్డుకున్నప్పుడు ఎట్టి ఫలితము నీయకపోయినప్పటికీ అవసరమైన సహాయ మందివ్వగల శక్తి ఒక్క "ప్రేమ" మాత్రమే! ప్రేమ సాధించలేనిదంటూ ఏదీ లేదు. అది త్యాగం చేయలేనిది కూడ ఏదీ వుండదు. భగవంతునికతీతమైనది మరొకటి లేదు. భగవంతుడు వినా మరేమీలేదు. అయినప్పటికీ, దైవము ఎల్లప్పుడూ ప్రేమవలననే పొందబడును. ఒక అన్వేషకుడు తన ప్రయత్నంతో సంపూర్ణ విధేయతతో తన హృదయాంతరాళం నుండి, పరిశుద్ధ వాక్కుతో ఆరాధిస్తే అవసరమగు గుణములన్నీ అలవడును."

రబియా కూడ యిదే మార్గంలో అతని మనస్సు లగ్నమగునట్లు తన సంభాషణను కొనసాగించింది. అంతా విన్నపిదప అతడు "ఆహా! ఈ రాత్రి నాకొక మధుర స్వప్నం మీరెటువంటి బ్రహ్మాండమగు ప్రవచనము లందించారోగదా! నా జీవితం ధన్యమైనది. నేనిప్పుడు యదార్థమగు అందమంటే ఏమిటో గ్రహించగలిగితిని. జీవితములో ఎలా ప్రవర్తించాలో, ఎన్నటికీ నశించని ఆ శాశ్వత సౌందర్యాన్ని ఎలా అన్వేషించాలో నేనిప్పుడు తెలుసుకోగలిగితిని." అన్నాడు.

అందుకామె "అవును. దానిని యీ విధంగా మాత్రమే పొంద గలరు. మరి అట్టి దివ్య సౌందర్యము యీ విధంగా లభించగలదు." అన్నది తాను జ్ఞానభిక్ష పొందుట కదే తగిన సమయమని తలచాడు.

"అమ్మా! నేనెంతో ధన్యుడను. మీకొరకే ప్రపంచంలో నేను చేయ కలిగిన దేమైనా సరే! నెరవేర్చుటకు సిద్ధముగా వున్నాను. ఏమి చేయాలో చెప్పండి." అన్నాడు.

అందుకామె ఒక చిన్న విన్నపమున్నదని చెప్పింది. అనగానే "ఏదయినా సరే అడగండి. నా సంపద కావాలన్నా మరేది కావాలన్నా మీ పాదాలచెంత సమర్పించుకుంటాను. తుదకు నన్ను సమర్పించుకున్నా అందుకు సిద్ధమే. మీకేమి కావాలని వుంటే అది అడుగుడు. ఇచ్చుటకు ఎదురుచూస్తున్నాను." అన్నాడు.

"నాకవేమీ అక్కరలేదు. ఒక చిన్న కోరిక మాత్రం వున్నది. దానిని మీరు తీరుస్తానంటే వెల్లడిస్తాను" అన్నది.

"ఆలశ్యమెందుకు అడగండి? ఏమిటా కోరిక?"

"మీరు ఇక్కడ విన్న విషయాల్ని మరి ఎన్నడూ యెవరితోనూ చెప్పరాదు. దయచేసి నన్ను చూడగోరే వ్యక్తులను నా వద్దకు రానీయండి. ఈ అందమంతా కేవలము వారి నాకర్షించుటకు వుపయోగపడే ఒక పంజ రము తప్ప మరేదీ కాదు తద్వారా వారికి శక్తిని యిచ్చి ఒక అవగాహన కలుగచేయుదును. జీవితంలో సరియగు సంయమన విధానం అందించున. ఆ దైవమే నన్నీ చిన్న రంధ్రింలో వుంచినందున, నేనిక్కడ వుండి ఆయన కార్యక్రమం చేయకలుగుచున్నాను మరి ఈ మానవులకు యదార్థ మగు అందము, యదార్థ ప్రేమ గురించి చెప్పగలుగుచున్నాను ఈరాత్రి యిక్కడ మీరు పొందిన ఈ అనుభవం గురించి మరి ఎన్నడూ ఎవరికీ చెప్పనని ప్రమాణం చేయండి. ఇదే నేను మీనుండి కోరే కోర్కె." అన్నది.

"ఓహో! ఇదా ఈ నగరంలోని రహస్యం. నగరం నగరం అంతా మీ సౌందర్యం గురించి శ్లాఘించింది అయినప్పటికీ ఏ ఒక్కరూ కూడ తమ అనుభవం గురించి మాత్రం చెప్పలేదు." అని అన్నాడు.

అందుకామె "అవును. నేను వారందరినుండి, యిలాంటి ప్రమాణము చేయించి వున్నాను. నేను నా ప్రభువును పొందుటకు చేసే పోరాటంలో ఈ నా అందం నాకొక బలమైన శక్తి" అన్నది.

"ఆ మాదిరి నీ అందాన్ని సిగ్గుచేటనిపించే ప్రేమకు బలికావియ్యరాదు. అందుకు బదులుగా నీ అందము బాబా సేవకొక బలమైన శక్తి కావాలి. బాబను గురించిన వుత్తేజిత విషయాన్ని యితరులకు వివరించ ప్రయత్నించునప్పుడు ముందుగా వాటిని సవిస్తరంగా తెలుసుకొని ఆదర్శమయ జీవనం గడుపుతూ నీ నడవడికద్వారా యితరులను ఉత్తేజపరచగలగాలి. అప్పుడు నీకేసమస్యా ఎదురురాదు" అని యీరుచ్ ఆ వుపాధ్యాయురాలితో చెప్పాడు.

## శాశ్వతుడు

భగవంతుడు సర్వాంతర్యామి ఆయన శాశ్వతుడు. సర్వకాల సర్వావస్థలయందు పిపీలకాది పర్యంతం మానవులంతా జగద్రక్షకుడయిన భగవంతుని యందు ఆదారపడి యుండును. సృష్టికి నూతన శక్తిని కలుగచేసి నవ చైతన్యం పెంపొందించి మేల్కొలిపే శక్తివంతుడాపరమాత్మ ఒక్కడే.

స్వార్థం పేట్రేగి, అధర్మము ప్రళయతాండవం చేస్తూ, నిత్య జీవితంలో చింత, వ్యాకులత, వుద్రేకం పెచ్చు పెరిగి తగినంత భద్రత లేనప్పుడు పరమాత్మ మానవరూపంలో అవతరించును. ఆయనే దైవ మానవుడు అనబడుచున్నాడు. బాహ్యంగా సశరీరధారణతో ఆయన ఎటువంటిపాత్ర ధరించినా, నిరంతరం బహిరంగంగానూ అంతర్గతంగానూ, సర్వులకూ

అన్వయించు మార్గంలో ఒక అర్ధవంతమగు జీవితం గడుపును. ఆయన జీవితంలో ఎటువంటి సంఘటనలు జరిగినప్పటికీ అవి ఆయననేమీ చేయలేవు.

ఆ యుగావతారాయన ఆధ్యాత్మిక సర్వాధికారి. ఇతరులకు ఆత్మసాక్షాత్కారం చేయ చగల అనంత శక్తివంతుడాయన ఒక్కడే. మానవుడు తానెవరో, తానెవరు కాగలడో తెలుసుకొనుటకీ దైవ మానవుడు ద్వారా కొలపాత్ర వంటివాడు. మానవ విలువలను, దైవీకమైన మానవ జీవితంలో అన్వయించి, ఆచరిస్తూ మార్గదర్శకుడై తన అనంత తత్వాన్ని ప్రబోధించును.

మానవులు తమకు తాము బంధాలను సృష్టించుకుంటారు. అజ్ఞానం చేత అలా చేసుకున్న దానిని వదిలించుకొనుట కష్టతరము కాగలదు గత జన్మలలో పేరుకున్న కర్మఫలాలను పారద్రోలుటకు చేసే ప్రయత్నంలో ఇంకా సృష్టించుకొనే చర్యలలో మునిగిపోయి జీవితమంతా ప్రయత్నిస్తుంది

అందుకే బాబా అన్నారు. "అన్వేషణ మానండి. ఏమీ కోరకండి. మిధ్యాత్మను పోగొట్టుకొనుడు." మిథ్యాత్మ పోగొట్టుకొనుట అంటే, నిన్ను నీవు పోగొట్టుకొనుట. నిస్వార్ధ సేవద్వారా నీకు నీవు పోగొట్టుకొనవచ్చును, ఒక వ్యక్తి, నిజంగా మానవాళిని ప్రేమిస్తే అప్పుడు తన సర్వస్వాన్ని అందరికీ యివ్వనిచ్చగించును.

ఎవరయితే ఆ దైవకృపయొక్క ప్రకాశాన్ని అపనమ్మకమనే అంధత్వంలో అందుకోలేకపోతున్నారో అట్టివారెన్నడూ ఆయన దయను పోగొట్టుకొనలేరు. బాబా ఒకసారి మండలితో ముచ్చటిస్తూ జీసస్ "తండ్రీ! వారిని క్షమించుము, వారేమి చేయుచున్నారో వారెరుగలేకున్నారు." అని ప్రార్ధించెను. అందుకే నేను అంటున్నాను. "ఏమి జరుగనున్నదో వారెరుగలేకున్నారు. వారిని క్షమించుము." అని అన్నారు.

"నేను మాత్రమే వుంటిని. హృదయపూర్వకంగా నన్ను జ్ఞాపక ముంచుకొనుడు, విడువక నామం స్మరించండి, నేను శాశ్వతంగా మీతోనే వున్నాను." అన్నారు బాబా. హృదయపూర్వకంగా బాబా అని పిలిస్తే "నేనిక్కడే వున్నాను" అని ఆయన జవాబిచ్చారు. సర్వకాల సర్వావస్థల యందు ఆయన ప్రతివారితోనూ వుండును. అయితే తనను జ్ఞాపకముంచు కొని లేవమంటారు.

"నేను ప్రతి హృదయమందూ వుంటాను. అయితే నేనక్కడ నిద్రలో వుంటాను. అనాదిగా నాకున్న అలవాటది. నన్ను లేపుటకు మీ రెల్లప్పుడూ బాబా అంటూ విడవక పిలవాలి. మీరలా పిలవగలిగినప్పుడు నేనెంతమాత్రం నిద్రపోనివ్వగించను. కనుక మీరు నన్ను నిద్రపోనీయ కండి" అని బాబా హెచ్చరించారు.

దీనినిబట్టి బాబాను విడువక అంటిపెట్టుకొని వుండవలసిన అగత్యం మనకు అవగాహన కాగలదు శాశ్వతుడయిన ఆయన, అంతటా సర్వాంత ర్యామిగా నిండి నిమిడీకృతమై వున్నారు. బాహ్యంగా ఆయన శరీరత్యాగం చేసినట్లు కనపడినా ఆయన సర్వమూ వ్యాపించి వున్నారు, ఆయన వునికిని మనమే గ్రహించి, ఆయనతో సంబంధం వదులుకొనక, ఆయన కొంగు గట్టిగా పట్టుకొని వుండాలి.

బాబా శరీరత్యాగానంతరం ఒకరోజున తన శాశ్వతత్వాన్ని, సర్వ వ్యాపకత్వాన్ని ఎలా నిరూపించారో గమనించండి. ఒకరోజున ఈరుచ్ మణితో ట్రస్టుకు సంబంధించిన కాగితాలేవో యిమ్మని అడిగాడు. అది సాయంసమయం. ఆమె పెట్టెలు వెదకి అవసరమైన కాయితాలు తీసుకొని యీరుచ్ దగ్గరకు వచ్చే సమయానికి, అతను బయటవున్న పంపువద్ద ముఖ ప్రక్షాళనం చేసుకుంటున్నాడు. సోదరి మణి, అతనడిగిన కాగితాలు యిద్దామని రెండుసార్లు పిలిచినా యీరుచ్ ఎటో దీర్ఘంగా చూస్తూ ఆమె పిలుపును గమనించలేదు.

మరోసారి పిలిచినప్పుడు ఏదో జ్ఞాపకం వచ్చినట్లు మణీవయిపు సైగచేసి దగ్గరకు పిలిచాడు. దూరంగా పొలంలో నిలవేసివున్న ఒక గొర్రెలమంద వయిపు చేయిచూపి అటు చూడమన్నాడు. "బాబా" అంటూ గొర్రెల అరుపులు వినపడుతున్నవి. సోదరి మణీకేమీ అర్థంకాలేదు. మంద మధ్యలో కనుచీకటిగా వున్నందున ఏదో గుట్ట ఆకారంలో అస్పష్టంగా కనపడుతున్నది అదేమిటో పోల్చుకోమని అడిగాడు. మణి పోల్చుకోలేకపోయింది.

యీరాచ్ అప్పుడు దానిని వివరిస్తూ యిలా చెప్పాడు.

"పగలంతా పాపమా గొర్రెలు తమ యజమాని రక్షణలో గడిపాయి అతడు ప్రత్యక్షంగా వాటిని అంటిపెట్టుకొని వాటిని సాకాడు. తన అరుపులతో వాటికి అందుబాటులో వున్నాడు మరి రాత్రయ్యేసరికి వాటిని ఒక చోట నిలవేశాడు అప్పుడుకూడ అతడు వాటితోనే వున్నాడు. వాటికి రక్షణగా తాను గొంగడీ కప్పుకొని వాటిమధ్యలోనే కూర్చున్నాడు. మరి అతడు వాటితోనే వున్నట్లు గుర్తుగా అతని అరుపులు వాటికి వినపడుటలేదు అందువలన అవి అతని వునికిని గ్రహించలేకపోతున్నవి. తమ యజమాని కొరకవి "బాబా" అంటూ అరుస్తున్నవి" అని వివరించాడు.

ఎంత చక్కని సారూప్యం. బాబా శరీరధారులై వున్నంతవరకు, ఆడుతూ పాడుతూ ఆయన సన్నిహిత్యాన్ని తనివితీరా పొందాము. ఆయన శరీర త్యాగంతో అయోమయంలోపడి, ఆయన దర్శనభాగ్యంకొరకు "బాబా-బాబా" అంటూ తపిస్తూన్నాము. ఆయన తనపై ఒకరూపాన్ని ధరించారు. ఆ రూపాన్ని వదలినప్పుడు ఆయన లేనట్లేనా? లేదు ఆయన యింతకుముందున్నారు, యిప్పుడున్నారు, మునుముందు వుందురు.

ఆయన శరీరందాల్చి మనమిత్రుడైనాడు. మనందరిని ఆయినను ప్రేమించునటుల చేశారు తన శరీరం వదలిన తరువాత మనందరిని తన సహచరులు కావలయునన్నారు. మరి మనం సహజజీవనాన్ని గడిపితేనే

ఆయన సహచరులం కాగలము. మనమంతా గొర్రెలమందవంటివారం, అవివేకులం, ఇంకా చిన్నపిల్లల మన స్తత్వం మనది. యదార్ధానికి ఆయనకు శరీరం లేకుండా వుండుట సహజస్థితి, శరీరధారణ ఆయనకు అసహజస్థితి.

మనకొరకే శరీరమనే శవపేటికలో బంధించుకొని వచ్చారు. మనము దానిని ఆయనయొక్క జీవనమనుకుంటున్నాము. కానీ అది ఆయన మరణం వంటిది. మాన. శరీరమనే ఈ చిన్న శవపేటికలో అనంతుడయిన ఆయన తనకు తాను ఇముడ్చుకొనుటచేత, మానవాళి అది ఆయనయొక్క వునికి అనే అనుభూతి పొందుచున్నది. ఇట్టి అనుభూతిలో ఆయన ప్రేమ అపార దయ. జాలి, కరుణ యివన్నీ అనుభవిస్తున్నారు. నిజానికి ఆయిన యీ రూపాన్ని త్యజించినప్పుడు, అత్యంత సహజస్థితిలో రాత్రి సమయంలో గొర్రెలకాపరి ముసుగులో మందమధ్య వున్నట్లే మనందరిలోనూ వుంటారు.

## అవతారుని సమాధి ప్రాముఖ్యం

దైవ మానవుని సమాధి దర్శించుటలో సద్గురువు సమాధీ దర్శిం చుటలో భేదమెంతో వున్నది. యీ తేడాని బాబా ఎంతో వివరంగా తెలి పారు భౌతిక పరమైన లాభాల్ని పొందగోరే వాంఛలు నెరవేర్చుకొనుటకు సద్గురువు సమాది దర్శిస్తే జయము కలుగవచ్చును. అయితే అన్వేషకుడు ఆధ్యాత్మిక వాంఛలు నెరవేర్చుకోగలగాలంటే, అందు జయము సాధించా లంటే, దైవ మానవుని సమాధి దర్శిస్తేనే నెరవేరగలదు.

దేశంలో ఎందరో సద్గురువులు, సాధువులు, మహాపురుషుల సమా ధులు ఎన్నో వున్నవి. అవన్నీ మంచివే. ప్రజలు వాటినుండి భౌతిక వాంఛలు, ఆధ్యాత్మిక లాభములు కోరి వాటి దర్శనము చేయవచ్చును. ఆద్యాత్మిక లాభం మాత్రం దైవమానవుడు లేదా అవతారుని సమాధి అన బడే విద్యుత్ సౌధం నుండి మాత్రమే ప్రసారితమౌతుంది.

దైవ మానవుని సమాధి భౌతిక లాభాలు, ఆధ్యాత్మిక లాభాలు. ఇవి రెండూ నిండిన ఖనివంటిది. చాల అరుదుగా, ఏ కొద్దిమందో దైవ మానవుని సమాధి దర్శించి, ఆధ్యాత్మిక లాభాన్ని అపేక్షింతురు. నిజానికా సమాధి అలా అపేక్షించతగు ప్రదేశమై యున్నది.

దైవ మానవుని సమాధి దర్శనానికి వేలాదిమంది భౌతిక వాంఛల నపేక్షింతురు. బాధా నివారణ, ఆర్థిక లాభము, కష్టముల నివృత్తి వంటి వాటిని అర్థింతురు. అట్టివారు వీటిని కూడ అక్కడ పొందగలరు.

మరి కొంతమంది సద్గురువుతో తమకున్న వ్యక్తిగత సంబంధ రీత్యా, అట్టి గురువుయొక్క సమాధి దర్శనం చేసి, తమ భౌతిక వాంఛలు తీర్చుకొనుటకు ప్రయత్నిస్తారు. ఈ విషయాన్ని వివరిస్తూ బాబా "వారలా చేసినందువలన ఆధ్యాత్మిక లాభం కొంతవరకు పొందగలరుగానీ, ఆలాభం పొందేది తిన్నగా సమాధినుండి కాదు. అట్టి లాభాన్ని వారెప్పుడయినా సరే దైవ మానవుని సమాధినుండి మాత్రమే పొందగలరు" అన్నారు.

దైవమానవుని సమాధి, దైవముయొక్క రూపానికి సంబంధించిన సమాధి. యథార్థ సామ్రాజ్యంనుండి, స్వయంగా వేసుకున్న ముసుగుతో ఆ దైవమే మాయలోనికి దిగివచ్చుట అన్నమాట. సమాధి అనగా ఆ దైవం మాయలో వున్నంత సేపు ధరించిన తెర అన్నమాట. మరి సద్గురువు సమాధిఅంటే, దైవసాక్షాత్కారం చేసుకున్న మానవుని శరీరముంచిన చోటు. ఈ మానవునే బాబా "మానవుడు దైవసాక్షాత్కారం చేసుకున్నప్పుడు అతడే మానవదైవమగుచున్నాడు" అన్నారు.

మరి దైవమే తన అవతరణకాలంలో యీ పుడమిపైకి దిగి వచ్చినప్పుడు, ఆయన దైవమానవుడగుచున్నాడు. మానవుడు తానే దైవమని గుర్తించిన వెంటనే మానవదైవమగుచున్నాడు. ఇట్టి మానవదైవము శరీర త్యాగానంతరం దైవంలో శాశ్వతంగా లీనమైపోవును. భగవత్సాక్షాత్కారం చేసుకున్న జీవి, ఆ శరీరాన్ని కొంతకాలం ఉపయోగిస్తుంది. బాహ్యముగా చూచుటకు, ఆ శరీరంతో ఎవరో కలిసి నడిపిస్తున్నట్లుండును. ఆతడు తన శరీరంతో సంబంధం వదులుకుంటాడు.

మానవదైవం సద్గురువైనాడు. మానవరూపంలో కొంతకాలం వుండును. దీనిని గురించి మెహెర్ బాబా తన భగవద్వచనములో చాలా చక్కగా వివరించారు. దైవమానవుని విషయం యిందుకు భిన్నంగా వుంటుంది

భగవంతుడు మానవుడుగా పురుష రూపం ధరించును. సమయ మాసన్నమైనప్పుడు పురుష రూపాన్ని పరిత్యజించును. ఈ రూపము పురుషరూపమే కానీ, పురుష శరీరము కాదు. అది ఒక తెర. యథార్థ సత్యం మాయలోనికి దిగివచ్చినప్పుడు అసత్యాన్ని కప్పిపుచ్చే ఒక ముసుగు. అది ఒక అత్యంత ప్రత్యేకత కలిగి వుంటుంది. అందుచే అట్టి రూపము యొక్క సమాధి జగత్ప్రసిద్ధమై యాత్రా దర్శన స్థలముగా ప్రాముఖ్యత కలిగివుండును. దైవ మానవుని సమాధికి యాత్రచేస్తే చాలా లాభాలున్నవి.

దైవ మానవుని సమాధి ప్రాముఖ్యతను వివరిస్తూ సోదరిమణి జహురానీ ఒక చక్కని సంఘటన వివరించెను. సాధారణంగా మహమ్మదీయులు మక్కాకు హాజ్ యాత్ర జరుపుతారు. మహమ్మద్ ప్రవక్త తన అనుయాయులతో వారు తమ జీవితకాలంలో కనీసం ఒక్కసారయినా మక్కాలోని కాబాను దర్శించాలని నియమం విధించెను.

మహమ్మద్ ప్రవక్తకు విధేయుడయిన భక్తుడొకడు, కష్టపడి సంపాదించి పైకం కూడబెట్టి మక్కా యాత్రకు సమాయత్తమయినాడు. అతడొక సామాన్య రైతుకూలీ అందుచేత అతడు తన ప్రయాణానికవసరమగు పైకాన్ని కూడబెట్టుటకు మిగుల కష్టించి పనిచేశాడు. చివరికాతడు ప్రయాణమై బయలుదేరు సమయానికి, సాటి కులంవారెందరో మక్కా యాత్రకు సిద్ధమయినారు. వారిలో ఆడ, మగ, పిన్నా పెద్దా అనేకులున్నారు, వారికి ఒక పవిత్రవంతుడు నాయకత్వం వహించెను.

యాత్రీకులంతా కాబా చేరుటకొక తేదీ నిర్ణయించబడింది. కాబా దర్శన మారోజు చేయాలనేది వారు నియమంగా పెట్టుకున్నారు. అందుచేత ఆ బృందమంతా దొరికిన సాధనాలన్నీ ఉపయోగించుకుంటూ త్వరత్వరగా నిర్ణయించిన తేదీలోపల కాబా చేరాలనే ఆతృతతో ప్రయాణం చేస్తున్నారు ఆ బృందంలో ఒక గర్భిణీ స్త్రీ కూడా వున్నది

ప్రయాణ ఆలసటతో ఆ గర్భిణీ స్త్రీ హఠాత్తుగా మార్గమధ్యంలో ప్రసవవేదన పడసాగింది. ఆమెకు కాన్పు రాబోవుచున్నందున, యిక ఎంతమాత్రం ఆమె ప్రయాణం కొనసాగించలేదని భావించి, ఆమెను దారిలో వదలి వెళ్ళిపోవుటకు బృందం నిశ్చయించింది. బృందనాయకుడు తక్కినవారితో "ఈమె పురుడు పూర్తగువరకు వుండి మనకాలము వృధా చేయుటకు వీలులేదు కాబా దర్శనానికి నిర్ణయించిన తేదీ చాలా చేరువైనది మనం వెంటనే కాబా చేరాలి, కనుక ఈమెను యిక్కడే వదలి తక్కిన వారం వెళ్ళిపోదాం" అన్నాడు.

"మనమంతా దైవదర్శనానికి అంటే అతని పనిమీద ఆయన దగ్గరకే వెళుతున్నందున ఆ దైవమే ఆమెను జాగ్రత్తగా కాపాడుగాక! ఈమె బాధ్యతను తానే తీసుకొనుట ఆయన విధి" అంటూ నాయకుడు తక్కిన బృందంతో సాగిపోయాడు.

ప్రవక్త వచనాలకు విధేయుడై, కష్టపడి సంపాదించి, మక్కాయాత్రకు కూడబెట్టి బయలుదేరిన భక్తుడుమాత్రం ప్రసవవేదన పడుతున్న స్త్రీని అర్ధంతరంగా వదిలివేసి తక్కిన బృందంతో వెడలుటకు యిచ్చగించ లేదు. అతడు ఈమెయొక్క దుస్థితికి, ఒంటరితనానికి జాలిపడ్డాడు, తన ప్రయాణం విరమించుకున్నాడు. పురుడు వచ్చేవరకు ఆమె చెంతవుండి సహాయపడ్డాడు.

అలా చేయుటవలన కాబా దర్శనానికి ముందుగా నిర్ణయించిన తేదీ నాటికి మక్కాచేరే అవకాశం జారవిడుచుకున్నాడు. ఫలితంగా పురిటి స్త్రీని పసికందుతో యింటికిచేర్చి తాను తిరుగుముఖం పట్టాడు.

కొన్నాళ్ళు గడిచిన తరువాత, మక్కావెళ్ళిన బృందం నాయకునితో పాటు తిరిగివస్తూ పురుడు పోసుకున్న స్త్రీ వుండే గ్రామం చేరారు ఆ రాత్రికి ఆ ఊరిలో మకాంవేశారు. యాత్ర పూర్తిచేసి తిరిగివస్తున్న బృందాన్ని కలిసి దైవదర్శన భాగ్యం పొందినవారి దర్శనంచేసి తానూ పునీతుడు కావచ్చని తలచి పురిటి స్త్రీతో వుండిపోయిన భక్తుడు వారివద్దకు వచ్చాడు.

"అసలుసమయానికి కాబాలోవుండి, ఆధ్యాత్మిక విలువ పొందలేక పోతిరి. కనీసం దైవదర్శనం పొందివచ్చిన మీ పావన స్పర్శతో నన్ను

ముందుగా అతడు ఖాళీ చేయిస్తాడు. ఆ తరువాత పైనుండి ఒక్కొక్క భాగమే పడగొట్టుకుంటూ తుదకు పునాదులు సైతం పెకలిస్తాడు.

అదే అవతారుడయితే, ముందుగా అన్నిభాగాల్లోనూ వున్నవారికి ఆ భవనం నిర్మూలించబడుతున్నట్లు హెచ్చరిక యిస్తాడు. ఆ పిమ్మట భవనం భవనంగానే వుంచి, పునాదిరాళ్ళన్నీ పెకలించి, ఒకే రాత్రిపై ఆ భవనమంతా నిలబడునట్లు చేస్తాడు. ఒక్క కుదుపుతో మొత్తం భవనం కూలిపోయే పరిస్థితిలో వుంచుతాడు. మాటిమాటికీ భవన పతనాన్ని గురించి అందు కాపురం వున్నవారితో హెచ్చరిస్తాడు. తన హెచ్చరిక పాటించి అనుసరించువారికి ఎట్టి ప్రమాదం కలుగదంతా. వారి రక్షణబాధ్యత తానే తీసుకుంటాడు. అసలు ఏమి జరుగుతున్నదో వారెరుగని స్థితిలో వారిని వుంచుతాడు. ఆయన హెచ్చరికలు పాటించనివారు పునాదులులేక, శిథిల మగుటకు సిద్ధముగావున్న భవనంతోపాటు వినాశమగుదురు.

బాబా చేసే కార్యక్రమం యిదే. తనయందు పరిపూర్ణ విశ్వాసం వుంచి ఆయన కొంగు జారవిడువక అంటిపెట్టుకొని వున్నవారికి, ఎట్టి అవాంతర పరిస్థితులు సంభవించినా, వెన్నంటి రక్షణ కలిగిస్తారు. ఆయన యిచ్ఛ మనపై వున్నప్పుడు ఆయనవల్ల పొందే అనుభవాన్ని మనకు ఎరుకలేకుండా వుంచుతారు. ఎరుక లేకున్నప్పటికీ ఫలితం అనుభవించ గలరు.

ఈ స్వామ్యం వివరించే సంఘటన ఒకసారి బాబా మండలికి జరిగింది. అవతార్ మెహెర్‌బాబా ప్రేమికులలో ఒక యోగి వుండేవాడు. అతడు ఒకరోజున బాబా సన్నిధి మండలివద్దకు వచ్చి, తామిన్నేళ్ళుగా అవతారుని కాలంలో వుండి ఏమి సాధించారో చెప్పుమని అడిగాడు. శిష్యులంతా మనస్సులో ఆలోచనలో పడ్డారు. యదార్థంగా తామిన్నాళ్ళుగా బాబాతో సాంగత్యం చేసి, సాధించినదేమీలేదనీ నిర్ధారణకు వచ్చారు. అంతా అదే నిర్ధారణకు వచ్చి ఏకాభిప్రాయానికి వచ్చారు.

శిష్యులలో అనేకులు సిరి సంపదలతో భోగ భాగ్యాలతో విలాస జీవితం గడిపినవారున్నారు. సుకుమార శరీరులున్నారు. కుటుంబ బాధ్యతలున్నవారున్నారు, మరి వీరంతా సర్వము త్యజించి, బాబా సాంగత్యంలో చేరి, ఆయన పెట్టిన అగ్నిపరీక్షకు నిల్చి, అన్నిటినీ అనుభవించారు.

కడుపునిండా తిండికీ. కంటినిండా నిద్రకూ యిన్నేళ్ళుగా అలమటించి ఈనాడు వారు సాధించినదేమిటా అవి ఆలోచిస్తే పూజ్యమవి వారి మనస్సుకు భావన వచ్చింది.

అదే వారంతా ముక్తకంఠంతో ఆ సన్యాసితో చెప్పారు, "మేమిన్నేళ్ళుగా బాబా సేవ చేసినందుకు ఫలితంగా పొందిన ప్రతిఫలం శూన్యం" అన్నారు. "అయితే మీరేమీ సాధించింది లేనప్పుడు యింకా ఆయనవద్ద వుండి లాభమేమిటి? అయన దగ్గరకు వెళ్ళి అదే చెప్పండి" అని సన్యాసి రెచ్చగొట్టాడు.

అంతలో బాబాతో సమావేశమయ్యే వేళయ్యింది. బాబా హాల్లోకి రాగానే శిష్యులంతా సుఖాశీనులయినారు. సర్వజ్ఞుడయిన బాబా శిష్యుల మనస్సులోని భావాల్ని గ్రహించారు. "మీరేదో ఆలోచిస్తున్నట్లున్నారు? ఏమిటి సంగతి?" అన్నారు. శిష్యులంతా బిత్తరపోయి ఒకరి మొఖాలొకరు చూచుకుంటున్నారు. "ఏం సమాధానం చెప్పరేమిటి? ఏమిటి ఆలోచిస్తున్నారు?" అని మళ్ళీ అడిగారు.

తప్పనిసరై శిష్యులంతకుముందు సన్యాసితో జరిగిన సంభాషణ అంతా వివరించారు. "అతనికి మీరేమని సమాధానం యిచ్చారని" ప్రశ్నించారు. "మేము సాధించినదేమీలేదని చెప్పారు" అన్నారు. శిష్యుల సమాధానంవిన్న బాబా మిగుల సంతోషించి చక్కని సమాధానం చెప్పారు. అలా కాక ఏదోకొంత అనుభవం పొందినట్లు భావించి వుండినచో, అది పొందియున్నందుకు మీలో అహంభావం పెరిగియుండెడిది. అందుకే నేను నన్నంటిపెట్టుకొని యుండువారికి, వారు నావల్ల పొందిన అనుభవం వారెరుగకుండునట్లు నేనే చేయుదును" అన్నారు.

బాబా వివరణను శిష్యులు మూగవోయి ఆలకిస్తున్నారు. "అట్లుగాక మీరు నావలన సాధించిన ఆధ్యాత్మిక అనుభవము తెలుసుకొన కలిగినచో అట్టి స్థితిలో వున్నవారు నా చెంతవుండుట కెంతమాత్రం యిచ్చగించరు. అప్పుడు నావద్ద వుండేవారెవరు? అందుకే నా యిచ్ఛ ప్రసరించి, వారికి వారటువంటి స్థితిని పొందినట్లు వారికి తెలియనియ్యను. కానీ వారు అట్టి ఫలితాన్ని మాత్రం వారు ఎరుకలేకుండానే అనుభవించగలరు" అని వివరించారు.

పునీతుణ్ణి చేయండి" అని వేడుకున్నాడు. వారి దర్శన స్పర్శలద్వారా ఆ భక్తుడు ఎనలేని ఆనందం పొందాడు.

ఆ రాత్రి బృందనాయకునికొక కల వచ్చింది. ఆ కలలో ఆయన ఒక కంఠం విన్నాడు. "ఈసారి కాశీ వచ్చిన వేలాదిమంది యాత్రికులలో ప్రభువుచేత ఒకేఒక్క యాత్రికుని యాత్ర అంగీకరించబడినది" అని విన్నాడు. అదివిన్న నాయకుడు "ప్రభూ! అతడెంతటి ధన్యుడోగదా! ఎవరి యాత్రను అంగీకరించితివి? ఎవరా అదృష్టవంతుడు?" అని ప్రశ్నించాడు.

అందుకు ప్రభువు "దారిలో ఒంటరిగా మీరు వదలి వెళ్ళిన తల్లి బిడ్డలను సురక్షితంగా కాపలాకాచి, వాళ్ళ యింటికిచేర్చిన భక్తుని అనుగ్రహించితిని" అని ప్రభువు సమాధానమిచ్చెను.

అందుకే యిక్కడ ప్రధాన మేమంటే, దూరాభారం లెక్కచేయక ప్రయాణం చేయాలనేది ప్రధానం గాదు దైవసమాధి దర్శనం చేయాలనే తపన ప్రధానం. ఒకవేళ భౌతికంగా దైవసమాధి చెంత వున్నా వుండలేక పోయినా, ముఖ్య విషయ మేమంటే, మనకు అక్కడ వుండాలనే కోరిక ప్రగాఢంగా వుండాలి. ప్రభు సమక్షంలో వుండాలని, ఆయనతో గడపాలని నరనరాన తపన కలగాలి. అట్టి ఆకాంక్షతో ఆయనను చేరుటకు ప్రయత్నించాలి.

## అవతారుని సాంగత్య మహిమ

తన ప్రేమికులతో అవతారుని సంబంధం, సద్గురువు తన శిష్యులతో పెంచుకొనే సంబంధం మాదిరి వుండదు సద్గురువు తన శక్తిచేత, వారి సంస్కారములను కొంతవరకు తగ్గిస్తాడు. కాని అవతారుడు అలాకాక, ఒక స్పర్శమాత్రంచేత క్షణమాత్రంలో సంచిత ప్రారబ్దములన్నిటినీ తుడిచి వేయగలడు.

సద్గురువు చేసే కార్యక్రమం, ఒక ఏడంతస్తుల భవనం పడగొట్టుటతో పోల్చవచ్చును. ఏడంతస్తుల భవనమొకటున్నదనుకొనుడు. అందున్న అన్ని భాగాలలోనూ కాపరాలుంటున్నారు. అటువంటి భవనం పడగొట్టు బాధ్యత సద్గురువుకు ఒప్పగించారనుకొనుడు, ప్రతిభాగంలోనూ వున్నవారిని

# సర్వ వ్యాపకత్వం

భగవంతుడు మానవ రూపంలో ఈ పృధ్విపైకి దిగివచ్చి మాన వాళికి తన దివ్యత్వము ఎరుకపరచినపుడు ఆయన అవతారుడుగా గుర్తింప బడుచున్నాడు. తనవునికిని మానవాళి మధ్య గుర్తించునట్లు, వారియందున్న అపార దయ వలన యుగయుగాలుగా భగవంతుడు మానవస్థాయికి దిగి వచ్చి మానవరూపం ధరిస్తున్నాడు. ఆయన భౌతిక రూపం మానవాళిమధ్య వున్నట్లు అనుభూతి కలుగుతుంది. ఒక సామాన్య మానవునిగా యీ విశ్వా నికి గోచరిస్తారు.

అవతార రూపంలో ప్రత్యక్షంగా భగవంతుని అవతరణ యేమైన నప్పటికీ పరోక్షంగా ఆయన యొక్క అనంత శాశ్వత స్థితిలో ఆయన వునికి దృఢతరముగా ప్రకటించుచుండును. భగవంతుడు శాశ్వతుడు, అగో చరుడు, అనంతుడు. అందుకే ఆయన సర్వ వ్యాపకుడు పిపీలకాది పర్యంతం ఆయన నిండి నిబిడీకృతమై వుంటాడు. ఆయన లేనిచోటు, పదార్థం వుండదు. సర్వమూ ఆయన ప్రతిరూపమే దృశ్య ప్రపంచమంతా ఆయననుండి వెలువడినదే ఆయనే మానవరూపంలో అవతారుడుగా అవతరించును. ఆయనే సర్వోన్నతుడు.

మానవాళిని అజ్ఞానమనే మురికిగుంటనుండి వెలికితీసి, భ్రాంతిమయ మగు భవబంధాలనుండి విముక్తి పరచుటే అవతారుని ధ్యేయం. ధోర్వాలా బాబా అనే మస్తు బాబాను గురించి ఇలా చెప్పాడు "మెహెర్బాబా తనలో యీ విశాల విశ్వమంతటిని కలిగివున్నారు. ఆయన ప్రతివారికి సద్గురువు. మరి ప్రతి శిష్యునిలోను ఆయన వున్నారు. ఈ ప్రపంచమే ఆయన. ఆయన దానికి అవలవున్నారు, దాని క్రిందనూ వున్నారు, నాలోవున్నారు, నీలో వున్నారు, అందరిలోవున్నారు. ఆయన మునులకు ముని. ఒక్కచూపులో భరతఖండాన్నంతటినీ చూడగలరు."

బాబా సర్వవ్యాపకత్వం బోధపరచే ఒక చక్కని సంఘటన జరి గింది. అది 1940 ప్రాంతంలో జరిగినది. బాబా శిష్యులలో డా॥ ఘనీ బాబాకు అత్యంత సన్నిహితుడు. ఘనీ సహజంగా హాస్యప్రియుడు. అప్పటి కప్పుడు అశువుగా వాడే పలుకులు ఆయనకు సైతం తృప్తిపరిచేవి. అశ్ర

మంలో శారీరక శ్రమ పడే శిష్యులకు, విశ్వ కార్యక్రమంలో అలసివుండే బాబాకు కూడా. ఘనీ అప్పుడప్పుడు తన చతురోక్తులతో వూరట కలిగించే వాడు

ఒకసారి బాబాకు ఘనీపై విపరీతమైన కోపం వచ్చింది. ఆ వుద్రేకంతో ఘనీని ఆశ్రమం విడిచి వెళ్ళిపొమ్మన్నారు. ఘనీ వెంటనే విధేయత చూపి చిన్న పిల్లవాడిలా మూటా ముల్లె సర్దుకుని మూట నెత్తిన పెట్టుకుని బయలుదేరాడు. బాబాముందుకు వచ్చి "వెళ్ళిపొమ్మన్నావుగదా! బాబా నే నెక్కడకు పోను?" అని అడిగాడు. అందుకు బాబా "నీ యిష్టం వచ్చిన చోటుకు వెళ్ళిపో. మళ్ళీ నీ ముఖం నాకు చూపించవద్దు" అన్నారు.

అలా అనగానే నెత్తిన మూట క్రిందికి దింపాడు. "బాబా నీవు భగవంతుడివి కదా! భగవంతుడు సర్వాంతర్యామి నే నెక్కడకు పోయినా నీ రూపం చూడకుండా వుండలేను. నా ముఖం నీకు చూపకుండా వుండా లంటే నీవు లేని చోటు నాకు ఎక్కడా కనబడుటలేదు. అందువలన ఎక్కడకు పోవాలో నేను నిర్ణయించుకోలేకపోతున్నాను. అందుకు నీవే సలహా చెప్పవలసింది" అంటూ ప్రాధేయపడ్డాడు. అతని విన్నపం విధేయతతో వట్టిపడుతున్నది

ఘనీ విజ్ఞాపనలో బాబా కోపమంతా మాయమైపోయింది. కోపమంతా నవ్వుక్రింద పరిణమించింది. అవధులు లేని తన అపార దయతో ఘనీని క్షమించి వదిలివేశారు. ఎక్కడా నేనే వుంటాను కనుక, నీవు ఇక్కడే వుండిపొమ్మన్నారు.

## జ్ఞానభిక్ష

సద్గురువు చేసే పనికి, అవతారుని కార్యక్రమానికి సామ్యం పొందదు. సద్గురువు తన శక్తిచేత సంస్కారములను కొంతవరకు తగ్గించగలడు. కానీ అవతారుడు అలా కాక, తన స్పర్శమాత్రం చేత, క్షణకాలంలో సంచిత ప్రారబ్ధ కర్మ లన్నిటినీ తుడిచివేయగలడు. బాబా చేసే కార్యక్రమం ఇట్టిదే. తన యందు పరిపూర్ణ విశ్వాసముంచి, ఆయన కొంగు జారవిడువక అంటిపెట్టుకొని వుండగలిగినవారికి ఎట్టి అవాంతర పరిస్థితులు

సంభవించినా ఆయన రక్షణ వెన్నంటి కాపాడుతూ వుంటుంది. మరి ఆయన హెచ్చరికలు పెడచెవిని పెట్టి తాదాత్మ్యం దాల్చిన వారికి దుష్ట ఫలితములు అనుభవించక తప్పదు.

బాబా ప్రేమికులలో ఒక వ్యాపారి వుండేవాడు. ఆయన బాబా ప్రేమలో ఎంత లీనమైపోయాడో అంతగా తన వ్యవహారములలో కూడ లీనమై వుండేవాడు అతని ఆలోచనలు ఎల్లప్పుడూ వ్యాపారము పైనే వుండేవి. ఒకరోజు అతని మిత్రుడొకడు వచ్చి, తానుకూడ భాగం కలుస్తానని, ఎక్కువ పెట్టుబడితో వ్యాపారం చేస్తే ఎక్కువ లాభం ఆర్జించవచ్చునని ఎరచూపాడు. తనను కూడ భాగస్వామిగా చేర్చుకోమని వత్తిడిచేశాడు.

వ్యాపారి బాబా ప్రేమికుడయినందున, బాబా సలహా తాను కోరదలిచాడు. వెంటనే బాబావద్దకు వెళ్ళి, మిత్రుని అభిలాష ఎరింగించాడు. "బాబా! నా మిత్రుని భాగస్వామిగా చేర్చుకొని వ్యాపారం కొనసాగించుటకు అనుమతి యివ్వవలసింది. మాకు నీ ఆశీర్వచనము అందివ్వ కోరుచున్నాను." అని అర్థించాడు.

అతడి మనోరథం బాబా గ్రహించారు. అమాయకుడయిన తన ప్రేమికుడు, ఒక కపటుని చేతిలో చిక్కుకుంటున్నాడని తెలుసుకొని, అతనితో వ్యాపార లావాదేవీలు పెటుకోవద్దని సలహా చెప్పారు. కానీ వ్యాపారికి అతని మిత్రునిపై ఎనలేని ప్రేమ ప్రగాఢ మైత్రి వున్నది. వ్యక్తిగత మైత్రి పురస్కరించుకొని బాబాతో తన మిత్రుని గుణాలు వర్ణిస్తూ అతడు చాల మంచివాడని, తననెట్టి మోసం చేయడని, అందువలన అతనితో వ్యాపారం చేయుటకు అనుమతించమని ప్రాధేయపడ్డాడు.

బాబా అందుకు సమ్మతించక అతనితో ఎట్టి సంబంధం పెటుకోవద్దని దృఢంగా చెప్పారు. అసలు అతనికి దూరంగా వుండమని హెచ్చరించారు. ఆయన హెచ్చరికను వ్యాపారి సరకు చేయలేదు. "బాబా! నా మిత్రుడు గురించి మీకు సరిగా తెలియదు. అతడు చాల మంచివాడు. అసలు వ్యాపారంగురించి మీకు సరిగా తెలియదు. వ్యాపారమంటూ భాగస్వామ్యం కలిసి చేయాలంటే, నా మిత్రునివంటి భాగస్వామితోనే చేయాలి. వ్యాపా

రహస్యములు ఎక్కువగా తెలియనందున అలా అంటున్నావు. ఏం ఫరవా లేదు. అతడు చాలా సరసుడు. కనుక అతనితో కలిసి వ్యాపారం చేయుటకు నీ ఆశీర్వచనము లివ్వవలసింది" అంటూ వత్తిడి చేశాడు.

మూర్ఖత్వంతో మాట్లాడే వ్యాపారిని చూచి ఆయన విసుగు చెందారు యిహనెంతమాత్రం అతడిని మందలించవలదలేదు. అయితే ఆ కారుణ్య దయా సముద్రుడు కనుక, జాలితో "నీ యిష్టంవచ్చినట్లు చేసుకోవచ్చును" అని చెప్పారు. అంత ఆ వ్యాపారి తన మిత్రునితో కలసి వ్యాపారం సాగించాడు. వ్యాపార రహస్యాలన్నీ మిత్రుడు అచిరకాలంలోనే ఆకళింపు చేసుకున్నాడు. క్రమంగా లావాదేవీలన్నీ తానే చూస్తూ లెక్కలన్నీ తన హస్తగతం చేసుకున్నాడు వ్యాపారమంతా తన చెప్పుచేతలలో వుంచుకున్నాడు. తుదకు అసలు వ్యాపారిని మోసగించి సంపదనంతా హరించాడు.

అప్పుడు సర్వమూ కోల్పోయిన వ్యాపారి ఆయన హెచ్చరికను లక్ష్యపెట్టనందుకు జరిగిన ఫలితము గుర్తించాడు. ముందుగానే తనమిత్రుని కపటలక్షణాలు గురించి బాబా చెప్పినప్పుడు వినలేదైతినిగదా! అని విచారించాడు. పైగా వ్యాపారమంటే తనకే తెలుసునని ఆయనకేమి తెలియదని మహాంధుడై తృణీకరించి మూర్ఖంగా ప్రవర్తించాడు. అందుకు తగిన ఫలితము అనుభవించవలసి వచ్చినందుకు పశ్చాత్తప్తుడై ఆయనవద్దకు చేరి క్షమాపణకోరాడు

సర్వజ్ఞుడైన బాబా రానున్న అరిష్టాన్ని ముందే హెచ్చరించినప్పటికీ, మాయావరణలో బందీలగుటవలన, మూర్ఖత్వంతో ప్రవర్తించి, ఆయన హెచ్చరికలు సరకుచేయక, అనర్థాన్ని కొనితెచ్చుకొని తుదకు పశ్చాత్తాపపడుట మానవసైజము అగుచున్నది. దైవముయొక్క జ్ఞాన భిక్షతో జ్ఞానోదయం కలుగుతుంది

## యథార్థ సుఖము

ఎందరో మానవులు ప్రపంచాన్ని త్యజించి, భగవంతునికొరకు ఎన్నెన్నో యిడుములకోర్చి ఎదుర్కొన్నారు. సువిశాలమైన జీవకోటి జాతులతో విరాజిల్లే యావద్విశ్వము కేవలం వూహామాత్రమే తప్ప

మరేమీ కాదన్నారు ఆయన. భగవంతుడు అందరివాడు. సద్గురువులు, ప్రవక్తలు తదుపరి వచ్చినవారే. ఈ సత్యాన్ని విస్మరిస్తే ఏ ఒక్కరూ కూడ ఆ సత్యాన్ని పొందలేరు. బంధుత్వరీత్యా, యీ భౌతిక బంధాలు కేవలం కల్పితాలు.

ఆధునిక మానవుడు కొంగ్రొత్త విషయ సేకరణ చేస్తున్నాడు. శాస్త్రీయ అన్వేషణ పరాకాష్ఠకు చేరింది అశేష జ్ఞాన సముపార్జన సాగించాడు. అయినప్పటికీ సృష్టిమాత్రం అంతుతెలియని రహస్యంగానే మిగిలిపోయింది. ఇటీవలి కాలంలో కనిపెట్టబడిన అవిరిశక్తి, విదుచ్ఛక్తి, అణుబాంబు మానవుని అపార మేధా సంపదకు చక్కని తార్కాణం. గొప్పవారయిన శాస్త్రజ్ఞులు, వైద్యులు, జ్యోతిశ్శాస్త్రవేత్తలు, యోధులు సైతం, ప్రకృతియొక్క విలక్షణ శక్తిముందు అసహాయులగుచున్నారు. ఎట్టి విచక్షణ లేక సర్వులు మరణానికి తల ఒగ్గవలసి వస్తుంది. అజ్ఞానంతో తమకు తామే తాపత్రయపడుట తప్ప మృత్యువును జయించలేకున్నారు.

హాఫీజు చెప్పినట్లు మనం మన ప్రకృతి సిద్ధమగు ఆలోచనలు, పుద్రేకాలనుండి బయటపడిననే తప్ప ప్రేమ యొక్క సత్యాన్ని చేరలేము. అలా యీ ప్రపంచాన్ని త్యజించి, ఎట్టి శ్రమ పడనవుసరం లేకుండా ఆ పరమాత్మను సాక్షాత్కారం చేసుకొనే మహద్భాగ్యం యీ యుగావతారుడు మెహెర్ బాబా, తన సమకాలికులమయిన మనందరికి కలుగచేశారు. "మీరు మీరుగా నాతో నివసి చుట అంటే, మీరు యీ ప్రపంచంలో నివసిస్తున్నప్పటికి దానిని మీరు త్యజించినట్లే" అన్నారు.

1922వ సంవత్సరంలో తన శిష్యులకు బాబా యీ విషయాన్ని వివరిస్తూ ఒక దివ్య సందేశాన్నిచ్చారు. అది అక్టోబరు పదకొండవ తేదీ. మధ్యాహ్నం. బాబాకు స్నానంచేయి స్తున్నారు. అంతలో బాబా ఒక శిష్యుని బజారుకు పంపి, చాక్లెట్లు తెప్పించారు. వాటిని శిష్యులందరికీ పంచి తినమన్నారు. కాసేపాగి, చాక్లెట్లు రుచిగావున్నాయా అని అడిగారు. ఒక్క అర్జున్ సుఫేకర్ తప్ప తక్కినవారంతా బ్రహ్మాండంగా వున్నవన్నారు.

మరో అయిదు నిమిషాలయిన తరువాత, ఇంతకుముందు తిన్న చాక్లెట్లరుచి, యింకా అనుభవిస్తున్నారా అని అడిగారు. లేదని అంతా ముక్తకంఠంతో బదులుచెప్పారు. మనస్సుకేదయినా మంచివస్తువు యిచ్చి నప్పుడు అది సంతృప్తి చెందుతుంది. అయితే కొద్దిసేపట్లోనే సహజస్థితికి చేరుకుంటుంది. చేదుమందులావి, విరోచనకారులగు ఆముదమువంటివి బలవంతంగా యిచ్చినప్పుడు, ముందుగా మనస్సు వ్యతిరేకిస్తుంది అయిష్టతతో అంగీకరించినా, మరికొద్ది సేపట్లో తిరిగి మామూలుస్థితికి వస్తుంది.

"బాధలు, ఆనందం రెండూ యీ ప్రపంచంలో అశాశ్వతం అవి క్షణభంగురాలు" యింతకుముందు మీరు మక్కువతో ఎంతో ఆనందంగా చాక్లెట్లు తిన్నారు. కానీ కొద్దిసేపట్లోనే ఆట్టి ఆనందం నశించి, అంతకు ముందున్న స్థితికి చేరింది. రుచికలిగిన జ్ఞాపకం గురించిన జ్ఞానమైనది. అత్యున్నత ఆనందం, ఉత్కృష్టమైన సుఖవంతమగు జ్ఞానాన్ని ఈ ప్రపంచంలో కలిగించేది, స్త్రీ సంతానం స్త్రీ పురుష సమాగం అత్యంతానందాన్ని కలిగించినా, అది ఎంతకాలం నిలిచిపుంటుంది? కేవలం కొన్నిక్షణాలు మాత్రమే!"

"అందుకే ఈ భౌతిక సుఖాలన్నిటికన్నా అత్యున్నత యధార్థసుఖం అవతారుని దర్శన భాగ్యంతో లభ్యమవుతుంది. యధార్థసుఖమనేది ఒక మహాసముద్రంతో పోలిస్తే, భౌతికసుఖమనేది ఆ మహాసముద్రంలోని ఒక బిందువుయొక్క చాయతో పోల్చవచ్చును. మీరు దీనివిలా గ్రహించ కలిగినప్పుడు, ఎప్పటికీ శాశ్వతంగా దానిని అనుక్షణం అనుభవిస్తూనే వుండగలరు" అన్నారు మెహెర్ ప్రభువు.

ఈ పోలికనుండి, శూన్యమగు ప్రాపంచిక సౌఖ్యము, శాశ్వతానంద మనే యధార్థసుఖముల గురించి వూహించవచ్చును.

—o—

102

**MEHER KATHAMANJARI**

**G. V. G. K. Chandramouleswara Rao**

తదుపరి ప్రచురణ

# నవజీవనం !!

మెహెర్ బాబా జీవితంలో అత్యంత ప్రధానఘట్టం "నవజీవనం"

గతాన్ని పూర్తిగా విస్మరించి, వర్తమానమందే జీవించి భవిష్యత్తును గురించి ఆలోచించక గడిపిన జీవనం "నవజీవనం"

సాధారణ మానవలీల నెఱపుతూ, భగవదన్వేషిగా సఖువిగా వ్యవహరించి ప్రచ్ఛన్నంగా గడిపిన పరివ్రాజక జీవనం "నవజీవనం"

నిరాశామయ నిస్పృహాయ జీవనమును శిష్యులకు ఆచరణ రూపంలో అలవరచిన జీవనం "నవజీవనం"

"నవజీవనం" అనుభవాలను ఆంధ్ర ప్రేమిక లోకానికి తదుపరి ప్రచురణగా అందిస్తున్నాం!!

సంకలనం

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P.01M177 | Date | 10/2/2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 101 | | |
| Missing Pages | NO | | |
| Prepared | G. Soundari | Scanned | [illegible] |
| BOOK SIZE | H 7.2 W 4.8 | Pages | 107 |